గేయం :

# మహాకవీ! జోహారు

— శ్రీ సురభి నరసింహము

ఓ మహాకవి కాళిదాసా!
జోహారు! నవకళాభాసా!

దశదిశల దీపించు - విశదమానసహంస!
రసభావ పరిపూర్ణ - రమణీయ కవిచంద్ర ॥ఓ॥

గీర్వాణవాణీతరంగిణులలోన
పొంగఁజేసితివయ్యా - రంగారు నీ కవిత!
ప్రకృతిశోభలతల్లి - "ఆఱుఋతువుల వల్లి"
రమణీయభావాబ్ధి - "రఘువంశ చరితమ్ము"
వలపుతలపులఁ జిలుకు అల "కుమారోదయము"
రాగాల నిలయమ్ము - "మేఘ సందేశమ్ము"
కమనీయ మహనీయ కావ్యమణులను దీర్చి
విశ్వ విలసిత కీర్తి - శాశ్వతాత్ముఁడవైతి ॥ఓ॥

శృంగార కరుణముల "శాకుంతలము" తొణక
వీర శృంగారముల "విక్రమోర్వశి" కులుక
లలిత భావాలతో "మాళవిక" నటియింప
నవరసోజ్జ్వల కవిత నాట్యమాడఁగఁ జేసి
నాటకమ్ములు దీర్చి - మేటి శిల్పిగ వెలయు ॥ఓ॥

ఏ మాతృ గర్భమున నేదేవి వరమునఁ
జనియించితివొ నీవు? సృజియించితినొ కృతుల?
ఆ తల్లి చలువయును - ఆ దేవి దీవెనలు
వెలయించె వనలతల - విరియించె పుష్పముల
ఆనాటి నీకృతులు - ఎనలేని శిల్పాలు
ఈనాడు మా యెదుట - కనిపించు చిత్రాలు!
స్థిరయశశ్చంద్రికా పరిదీప్త మహితాత్మ!
అందుకొమ్మా! ప్రీతి - అనురాగ మధుగీతి!
జేజేలు, నీ కళకు - రసిక మానసవాస!
జోహారు, నీ కిదే! మహనీయ గుణభాస ॥ఓ॥

రసధుని : శ్రీ విశ్వనాథ సాహిత్య సమాలోచనము - 4

# విశ్వనాథవారి లఘుకావ్యాలు

— శ్రీ వేటూరి ఆనందమూర్తి

[మహాకవులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యాన్ని అధ్యయనం చేయడంకోసం అక్టోబరు 26, 27 తేదీలలో 'రసధుని' పక్షాన 'విశ్వనాథ సాహిత్య సమాలోచనము' ఏర్పాటు చేయబడినది. ఈ సమావేశాలలో శ్రీమద్రామాయణ కల్పవృక్షముపై శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ సంపత్కుమారగారు, లఘుకావ్యములపై శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, నాటకములపై శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు, నవలలపై శ్రీ జువ్వాడి గౌతమరావుగారు, శ్రీ నాగభూషణ్‌గారు వ్యాసములను చదివినారు. ఈ వ్యాసములలో ఇది నాలుగవది. —సంపాదకులు.]

అది లిక్కికొండ కాదు, హిమాచలము. మనదేశ ప్రతిష్ఠకు, సంపదకు అదే మూలము. దాని ఔన్నత్యము అందరానిదీ-పొందరానిదీను. సర్వసాధారణంగా అన్నిటికిమల్లే ఉత్తరించడానికి తరంకానిది. పరికించి ఒకవేళ ఊహాప్రపంచంలో చూడబోతే పాగాలు పడగొట్టేపాటిది దాని ఎత్తు.

ఆ మంచుకొండ చల్లనిదీ-తెల్లనిదీను. మబ్బు తున్కలు ఎగురుతూవుంటే, మంచుతుంపరలు చిందుతూవుంటే, ప్రకృతిసంపదతో దర్శించినవారి నదాటుగా ఆ కట్ట ఆకర్షించేటిది. అది 'మృదు నవ ఝరీ జనిగిరి' గంగా సింధులకు పుట్టినిల్లు. తన నదీ హస్తాలతో దేశాన్నావహించి, దీవించినట్టిది. ఆ నిండుకొండ చలికి తొణికేదికాదు. భీష్మించుకు కూర్చుంటుంది. కాని వేసవి కాక తాకగానే కడుపు చుమ్మలు చుట్టి కరిగి కాల్వలై పోతుంది. రసధారలు పారిస్తుంది. గ్రీష్మాతపానికి అనుతాపంచెంది ఆర్ద్రమైపోయేది — (ఇక్కడ ఒక్కమాట, గ్రీష్మాతపమంటే తగులడిపోయేదీ, తగులబెట్టేదీ అని కాదు- ఆహ్లాదకరమైన, జీవోద్ధారకమైన ఆతపమన్నమాట !)-'కేవలము పైకె కఠినుండు గ్రీష్మరాజు'. ఆ ఆతపతాపం లోకరతుకమే. ఆ అనుతాపమే ఆ మంచుకొండ నుండి రసప్రవాహాలకు కారణమయింది.

ఆ మంచుకొండ గుండె బండఅయినా కోకిల కూసిన కూతా ప్రతిధ్వనిస్తుంది— అందులో- మేఘ గర్జనమూ మారుమ్రోగుతుంది.

ఆ కొండ దూరాని కెంత వెలవుగొల్పుతూవుంటుందో దగ్గరించినకొద్దీ అనుభూతి అంత విడ్డూరంగావుంటుంది. మంచురాళ్లు, మధ్యమధ్య సెలయేళ్లు- అక్కడక్కడ లోయలు, అంతుతెలియని శిఖరాలు - ఆకర్షిస్తున్నట్లూ వుంటుంది - అదరగొడుతున్నట్లూ ఉంది. ఆర్ద్రిమౌతున్నట్లూ ఉంటుంది. అహంకరిస్తున్నట్లూ వుంటుంది. నిజమే! తగిన ఉడుపులు లేకుండా తొందరపడి వేలుపెడితే కొంకర్లుపోయి తీరుతుంది. అట్లా కొంకర్లుపోతవి మన కెందుకని తిరిగి వేలుపెట్టకుండా వూరుకోను బుద్ధిపుట్టదు. తన ఎత్తు తెలియలేరని ఆ కొండ నిక్కుతూనేవుంటుంది. గౌరవంతో దాన్ని తెలుసుకోడానికే ప్రజలు యత్నంచేస్తూవుంటారు. చేశారు కూడ. నేడుకాకుంటే రేపు దాని అసలు ఎత్తు తెలుసుకొనేతీరుతారు.

ఇదీ కవిసమ్రాట్ శ్రీ సత్యనారాయణగారి అంతస్స్వరూపం. అనంతమై గగనచుంబిగా నున్న శ్రీవారి ప్రతిభలో ఒకమూల, ఒక కోణంమాత్రమే నేనిప్పుడు చూస్తున్నాను. అదే పెద్దచేసి చూస్తున్నాను. చూచినదాన్ని పొందిన అనుభూతితో ఇందు మీకు అందించడానికే ముందు యత్నిస్తున్నాను. కవిగా రన్నారు.— "బాలకులు మూగి వెన్నెల వత్తికొఱకు
శ్లక్ష్ణ దృష్టులు వెదుకాడు చందమునను
ముగ్ధ హృదయులు నా మిత్రములు మదీయ
గీతికార్థములకు వెదకెదరు దేవి!" అని !!

ఆ వత్తి ఏదో నేను దొరికించుకోవాలనే చూస్తున్నాను. అది నాకు దొరక్క పోతే నా దృష్టిలోపమే అనుకోండి గాని వత్తి అక్కడ లేకపోలేదు.

ఇక్కడ పరమార్శించడానికి ఆయన లఘుకృతులే ఎన్నోవున్నవి. కథా కావ్యాలున్నవి; వర్ణనాత్మక రచనలున్నవి; శతకాలున్నవి: గీతాలున్నవి; గేయకథలున్నవి; పద్యాలున్నవి; పాటలున్నవి; స్తుతులున్నవి; చాటువులూ ఉన్నవి.

కవిగా ఈయన జన్మించినది 20 వ శతాబ్దిలో. ఆనాళ్లలో దేశాన్నావరించిన, ఆవేశిన స్వాతంత్ర్యభావం ఈయన సంస్కారంపై ప్రభావం చూపింది. ఉద్బోధితుడై దేశాన్ని తానూ ఉద్బోధించాడు. మన సంప్రదాయం, ఆర్య మర్యాద ఏమిటో నిగ్గుతేర్చి పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని తొలగింప జేశాడు. పూర్వ జన్మకృతమైన కవితావాసనతో కవీశ్వరుల శిష్యతానుగ్రహం చేత - కవిత్వంలో ఆ సంప్రదాయాన్నీ, స్వాతంత్ర్యాన్నీ ప్రదర్శించగలిగాడు.

ప్రతిభావంతుడైన ఆ వ్యక్తికి లౌకికంగా కలిగిన నిరాశానిస్పృహలు కారణంగా, సహజంగా తనలో గుబగుబలాడుతుండిన ఆ ఆవేదన కావ్య రూపంగా రసావిష్కారం పొందేటప్పటికి దాని బహిస్స్వరూపం కొంత కటువు గాను, పెటువుగాను తయారైందేమో! కవితారంగంలో అధికారంచేయ గలట్టి అర్హుడుకాబట్టి తనకు తెలియకుండానే నియంతగా తయారైనాడు. ఉన్నమాట పటువుగా అనడం, అన్నమాట చెల్లించుకోవడం అలవాటయింది. ఇదీ నాకు గోచరించే వారి బహిస్స్వరూపం. ఇదే ఆయన రచనలలోనూ వ్యంజితము.

కాని హృదయం అతి లలితమైన భావస్పర్శను కూడా తట్టుకోజాలక అనంతంగా స్పందించి, స్పందింపజేసేటంత సున్నితమైందీ, రసనిష్ఠమైందీ కాబట్టి పాదరసంలో చెరచెరలాడి తొణికిసలాడింపచేస్తుంది. ఆయన ఒక గొప్ప కవి. ఎల్లప్పుడూ 'ఊరకనేదో ఊహించుచుండును.' ఆయన తన కవితలో - 'ఒక ఔచితి లేదు, భాష లేదు, ఆకృతి లేదు - కాని ఊరక రసాత్మతనే స్రవియించి పోదు' నంటాడు. లేదంటే లేదని కాదు. వాటిని మించిపోయిన రసదృష్టి తనదని అభిప్రాయము. 'ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి రెట్లు గొప్పది నవకథాదృతిని మించి' అందుకే 'నగోన్నిద్విగ్న'మైన దాయన కవితారసావేశం.

"ఒకసారి నాలోన నూహించి యేమియో
స్త్రీవోలె సిగ్గు పొందెదను నేను,
ఒకసారి యెదపొంగి యూగించి కవివోలె
మృదుకంఠ మెత్తి పాడెదను నేను,
ఒకసారి హృదయ మూరక బాధపడి కంటి
తుదలందు నీరు లూర్చెదను నేను,
ఒకసారి వీతహేతుకముగా సౌఖ్యమ్ము
విరిసిపడ్డట్లు నవ్వెదను నేను,
ఏ మహాభావమో వచ్చి హృదయ మావ
రించి నాసంధులను గదలించి వైచు
ఆ మహాభావ మరసెద నన్నకొలది
నా విలోచన పథమెల్ల నల్లనయ్యె."

అన్నాడు. అట్టిది ఆయన రసాత్మత. దానిని 'పాడుటయె పరమార్థము' వారికి.

దానినీ 'క్రొంగ్రొత్తలు తేర్చు గుంఫనలతో వర్ణింపబోయిరి; కాని సంప్రదాయ బద్ధులు కాబట్టి వారికి 'పూర్వకవి పాదాంకంబులే దిక్కయినవి'.

ఆయన దృష్టిలో రసమయమైనదే కవిత. వాగ్నేతృత్వము, వృత్తరీతి, 'రసభావౌచిత్య శయ్యార్థ సంలగ్నోక్త్యంచిత లక్షణధ్వని గుణాలంకారము' లన్నీ వుండా లందులో. ఆవేశాత్మకంగా వుండాలి. ఉదాత్తంగా వుండాలి. చమత్కారజనకంగా అహ్లాదకరంగా వుండాలి. ఇదీ కవిత్వమంటే, మొత్తం మీద ఆయన దృష్టి-సృష్టి కూడా అంతే.

అసలు కవిత కవినీ, ప్రకృతినీ ఆలంబనంగా చేసికొని పుడుతుంది. ప్రకృతి ఆధారమాత్రమై కవ్యాత్మ ప్రధానంగా ప్రవ్యక్తమయ్యేటప్పుడు ఆ కవిత ఆత్మాశ్రయంగా Subjective గా సాగిందంటాము. అదే కవ్యాత్మ ప్రకృతిలో లీనమైపోయి; ప్రకృతికే ప్రాధాన్యమిస్తూ రచన సాగింపబడినప్పుడు ఆ కవిత పరాశ్రయంగా - లేక - వస్త్వాశ్రయంగా objective గా-ఉన్నదంటాము. కాని కవితలో ఇదమిత్థంగా దీని విభాగ మిట్టిదని మాత్రం చెప్పటం కష్టం. కాని ఈ రెంటికీ passion - అంటే - రాగావేశం మాత్రం అధికంగా వుండాలి. కాబట్టి ఒక్క మాటలో Passionate impression of the self thro' the object - subjetive అనీ - passionate expression of the object thro' the self - objective అనీ చెప్పవచ్చు. కాని కేవలం ఈ రెండూ కాక రెంటికీ మధ్యస్థమైన dispassionate study of the object by the self ఒకటుంది. అదే realism. (ఇందులో study of the object అన్నాను. The effort of study is nothing but the impression you get and the expression you give - దీనినే దర్శనము, వర్ణనము లేదా ముద్రణము, చిత్రణమూ అనీ అనవచ్చు.) కాబట్టి Passionate impression of the self premeated in the dispassionate expression by the self - realism అన్నమాట - అంటే ఆవేశంతో దర్శించిన దాన్ని ఆదేశం లేనట్లుగా వర్ణించడం అన్నమాట. అందుకే వాస్తవికతలో రాగావేశం లేనట్లు dispassionate గా కనిపిస్తుంది. ఏమైనా ఈ అన్నిటికీ దర్శన వర్ణనాత్మక శక్తులు అఖండంగా వుండాలి. దానికి రసావేశం అంటే emotion తోడు కావాలి. అప్పుడే అది కవిత అనిపించుకొంటుంది.

పురాణయుగంలో ప్రాయికంగా కవిత objective గానే వస్త్వాశ్రయంగానే సాగిపోయింది. కాని ప్రబంధయుగం వచ్చేసరికి అష్టాదశవర్ణనలూ పెచ్చు పెరిగి చాలా subjective గా కవిత మార్పుచెందింది. ఆపైన వాస్తవికత

ప్రబలిపోయింది. అటుపై తిరిగి ఈ ఆధునికయుగంలో ఆత్మాశ్రయ కవిత్వమే అధికంగా వచ్చింది. కాని వస్త్వాశ్రయంగానే కవిత చెప్పినవారూ నేడు లేక పోలేదు. ఈ రెండుపాళ్ళూ నేటికాలపు కవిత్వంలో వున్నా- రెండు పాళ్ళూ సమంగా ఒకరి కవితలోనే వుండడమన్నది చాలా అరుదుగా శ్రీ సత్యనారాయణగారి కవిత్వంలోనే సమకూడింది. నేటివారైనా నాటివారు కాబట్టి రెంటినీ రచనలో మేళవించుకొన్నారు. అందుకే- మన మివ్వకపోయినా, వారు పుచ్చుకోకపోయినా- వారికి కవిలోకంలో అగ్రతాంబూలం.

ఇందాక- "Passión" లేనిదే కవిత లేదన్నాను. దానినే మనం సాధారణంగా రాగము, ప్రీతి, ప్రేమ అనే నామాంతరాలతో అంటూవుంటాము. ఇది ముందుగా passionate towards the beloved, kith & kin; towards the nation; then towards the nature— ఉంటుంది. స్వకుటుంబం మీదా, స్వదేశం మీదా, ఈ రెంటికీ ప్రకృతి సన్నిహితమైనది కాబట్టి ఆ అభిమానమూ, రాగమూ, ప్రీతీ, ప్రేమా - చివరికి తన చుట్టూవున్న ప్రకృతిమీదా కూడా ఉదయిస్తూ పెరుగుతూవుంటుంది. కాని లోకంలో దాని స్వరూపం వస్తుధర్మాన్ని బట్టి క్షణికం కావడంతో అశాంతికి దారితీస్తుంది. సంయోగంలోని శాంతి- వియోగంలో నిర్వేదంగా పరిణమిస్తుంది. శాంతి వాంఛనీయము, నిర్వేదము పరిహార్యమూను. కాబట్టి ఆ నిర్వేదం నుండి శాంతిని మానవుడు పొందగోరుతాడు. అప్పుడే అది భక్తిగా పరిణమిస్తుంది. భక్తికి శాశ్వతుడైన భగవంతుడు ధ్యేయం. అందుకు మానవుడు సాధనం. అందుకే ఆత్మాశ్రయమైన కవిత యొక్క పరిణామంలో భక్తిరసపూరితములైన రచనలకే అగ్రస్థానం. సాధారణంగా శతకాలు, ఉదాహరణాలు అన్నీ ఈ కోవకు చెందినవే. ఇవన్నీ subjective, అందుచేత ఆత్మాశ్రయ కవిత్వమనే ఈ విభాగంలో ముందు రాగం వ్యక్తమయ్యే—1. ప్రణయము; 2. విలాపము; 3. దేశభక్తి; 4. ప్రకృతి వర్ణన; 5. భక్తి- అనే విభాగాలను దృష్టిలో వుంచుకొని శ్రీవారి లఘుకృతులను మనం పరామర్శించుకోవచ్చు. వీరి చాటువులు, అప్పుడప్పుడు వ్రాసిన కొన్ని గీతాలు కూడా ఈ శాఖక్రిందికే వచ్చేవయినా వాటి మాధుర్యాన్ని బట్టి విడిగా చివరికి పరామర్శిద్దామనుకొన్నాను. ప్రస్తుతం - మొదట:

### 1. ప్రణయము - విలాపము:

ఈ శీర్షికలో వీరి శృంగారవీథి - శశిదూతము - గిరికుమారుని ప్రేమ గీతాలు, వరలక్ష్మీత్రిశతి - మున్నగు కావ్యాలను పరికిద్దాము. శృంగారవీథి

రాధామాధవుల ప్రణయాన్ని ఉదాత్తంగా చిత్రించిన కావ్యము. 'నీకు నేను రంకుటాలనని లోకం చెప్పుకొంటోంది. అంచేత ఇహ నీవు కవపడితే నీతో మాట్లాడనని నిశ్చయం చేసుకొంటున్నానోయ్' అన్న రాధిక అలానే తన ప్రేమను ఏకాదశవిధములైన రాగంగా ప్రవ్యక్తవఅచి భక్తితో తాదాత్మ్యానందాన్ని అనుభవిస్తుంది. ఇందులో లౌకికాలౌకికములైన శృంగారాన్ని కవి చక్కగా చిత్రించాడు. ఈ చిత్రణలో పోతన్నను మరపించే భావసంపద - అక్కడక్కడ రచనా మర్యాదా కూడా కానవస్తవి. ప్రాతస్స్నవములో వినండి-

'ఒయ్యారమ్ములనిద్రకాని నిదురేలోయీ యశోదా శిశూ !
కయ్యామ్ముల్ మిగిలెన్ విచిత్ర శిశువా ! గ్రామమ్మునందెల్లనో
యయ్యా ! కోపమువద్దులే యననులే ! ఔపైడిఖిల్లావులే !
సయ్యాటమ్ముగ నంటలే ! యదుకులస్వామీ ! రమావల్లభా !'(పుట-36)

('మరుజ్జవనాస్త్రం బొసగున్ సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా' అని రాయలన్నట్లుందిది !) అలాగే దూతగా పోయిన చేటి తిరిగిరాగానే—

'నా సందేశము తానెఱింగికొనెనా ? నామాట లాలించెనా ?
రాసక్రీడలు మానెనా ? యిచటికిన్ రాగాదలంపూనెనా ?
గోసంత్రాణసుశీలుఁ డచ్యుతుఁడు నాకుం బ్రాణబంధుండునే
నాసంకర్షణదేవుప్రాణములకున్ బ్రాణంబనే నెచ్చెలీ' (పుట-7)

ఇందులో పోతన్నగారి రుక్మిణి కనిపిస్తుంది. ఇలాగే ఎన్నైనా పేర్కొనవచ్చు. ఈ కావ్యంలో ప్రణయం పారమ్యాన్ని పొందింది. మాటల్లో ఈయన బొమ్మలు చిత్రించాడు.

**తరువాత శశిదూతం :** కోపన పరాఙ్ముఖియైన క్రొత్త పెండ్లికూతుర్ని చేరదీసికోడానికి యత్నించే నవయువకుడు శశిని దూతగా పురస్కరించుకొంటాడు. ప్రాబంధిక మర్యాదతో, కవి, తూలనలేకుండా, ఔచితీసమంచితంగా ఈ లఘుకావ్యాన్ని చిత్రించాడు.

'ఒక నిషధేశ్వరేంద్రునకు నొక్కమరాళమతల్లికంబడెఁ
ఒక రఘువంశదేవునకు నొక్కప్లవంగమవీరునింబడెఁ
ఒకగిరివాసి యతునకు నొక్క పయోధరసాధువుంబడెఁ
సుకములు కల్గె నిన్ను బడిసూ ! సుఖమందఁగ నేను గోరెదఁ'
(పుట—17)

అంటాడు నాయకుడు. ఆ 'అమృతము కూడుకట్టిన దొర' ప్రసన్నుడయితేనే

గాని ప్రియురాలు ప్రసన్నురాలుకాదు. అందుకని 'తనయంత శిల్పికలుగం బోడన్న నన్నయ్యవ్రాసిన' భాషలో 'మాకు ప్రసన్నమయ్యెదుగా' అని పద్యాంత ముండేటట్లు ఒక పది పద్యాలు మనోజ్ఞంగా కవి వ్రాశాడు.

ఇది ప్రశస్తమైన రచన - ఇట్లాటి కవితాశిల్పాలను ప్రదర్శించే ఘట్టాల లోనే వీరిని 'నన్నయ్యాయు, దిక్కన్నయు' నా వేశిస్తారేమో అనిపిస్తుంది.

'...చలిమిరిగా రహస్యముగ సన్నగఁ జెప్పనియట్లుచెప్పి కాం
తలును నెఱుంగకే తమకుఁదాముగ నల్లల జారివచ్చున
ట్టులు వొనరింతు ప్రేమల మడుంగులు కట్టలు పొర్లి పాఱఁగన్' (పుట-22)

పొనరిష్తూ వలపుల దూత్యముల్ నడుపువై ఖరియే - ఆ చంద్రుని దెస వేఁట! దానినెంతో చమత్కారంగా సాధించుకొన్నాడీ కావ్యంలో నాయకుడు.

ఇక - గిరికుమారుని ప్రేమగీతాలు - మరికొన్ని కృతులు

పైని పేర్కొన్న కావ్యాలలో సంయోగ మాధుర్యాన్ని అలౌకికందాకా ఎత్తి ప్రదర్శించిన కవి యిప్పుడీ క్రింది కృతులలో విశ్లేషంలోని కారుణ్యాన్ని ఒలికిస్తాడు. శృంగారం తర్వాత మనిషిని కరిగించి ఊపిపారేసేది కరుణఒక్కటే. ఎంతసమర్థుడైనా సామాన్యంగా మానవుడు ఆనందాన్ని అనుభవించినంతగా వేదననమభవించలేడు. కాని వేదనను ప్రకటించినట్లుగా ఆనందాన్ని ప్రకటించ లేడు. 'గుండెగొంతుకలోన కొట్లాడుతాదీ'—అన్నట్లు ఆ అవేదన-మూగబాధ-యుగయుగాలనుండీ వున్న ఈ జీవుని వేదన - భాషారూపంలో బహిర్గతం కావడంలోనే రసావిష్కారం జరుగుతుంది. శోకమే శ్లోకంగా పరిణమించిన దనడాని కర్థమదే; ఈ కవే ఒకసారి అన్నారు 'అయినవాడికి దుఃఖము అవతలి వాడికి రసమూ' అని! నిజమే. ఆయన వేదన ఎట్టిదో గమనించండి.

'అన్మదీయ కంఠమునయం దాడుచుండె
నొక యెదోగీతి బయటికి నుబికిరాదు
చొచ్చుకొని లోనికిం బోదు వ్రచ్చిపోయె
నాహృదయ మీ మహాప్రయత్నమ్మునందు' (పుట 1)

'అచ్చమౌ మహదానంద మనుభవింపఁ జాల దీ శరీరము బాధ సమ్మిళితము కావలయు బోలెనున్నది...' అంటాడు.

శారీరకమైనబాధ వేరు, మానసికమైనబాధ వేరు, ముల్లు గ్రుచ్చుకోవడం వంటిది మొదటిది. ఎడబాటు రెండవది. లోకంలో స్థల మర్యాదనుబట్టి

యేర్పడిన తాత్కాలికమైన ఎడబాటే బాధాకరంగా వుంటుందే-ఇక శాశ్వతమైన ఎడబాటు - మరణం - మరీ హృదయవిదారకం కాదామరి! అమాయక హృదయానికి ఆ బాధ మొటిసారి ఎంత జాలిగా వుంటుందో ఊహించండి. ఆయనంటాడు.

'మొదటిసారి నా యెడదలో ముల్లునాట
బడి మహాశూలమును బోలె బాధపెట్టె
దేహము భరించుటయ కష్టమై హృదంబు
రాశి బాడబవహ్ని పరాక్రమించె.
అది మొద లనంతములుగ నిందు దిగబడిన
శూలములు ముళ్ళవోలిక సుంత బాధ
పెట్టి యంతట శాంతించు; వెనుకముల్లు
కలఁకిడిన నంతగా బాధకలుగబోదు' అని! (పుట 8)

నిజమే! బండబారిపోతుంది. ఈ గిరికుమారుని ప్రేమగీతాలు ఆ జీవుని వేదనకు ఫలితములే!

'ఇవి యథాకంఠ నిర్గతం బవి తథావి
లిఖితములు ప్రేమగీతముల్ దేవి!' అంటాడు.

అలాగే ప్రియావియోగంతో మథనపడుతున్న కవి

'ఇది ప్రతినబూనితిన ప్రవాహింపజేతు
నీయడుగుదమ్ములందు ననేక నాక
వాహినులు వాని నీరముల్ ప్రాశనమ్ము
గాగ భావ్యాంధ్రదేశ సత్కవులకెల్ల.' (పుట-71)

అనుకొంటాడు. ఆంగ్లంలో Keats, Shelly ప్రభృతులు రొమాంటిక్ కవులు ఇట్టి గీతాలనే రచించారు. ఆ ఛాయలే ఆధునికులైన మన కవుల ప్రేమ గీతాల లోను గోచరించినవి. వేదనకు 'ఛాయ' ఏమిటి? దాని స్వరూపం అందరి హృదయాలలోను ఒకేమాదిరిగా ఉంటుందేమో. కొందరు View-less wings of Poetry తో ఎగిరిపోవాలంటారు. 'ఏడ్వవలె'నంటారు మరికొందరు. ఏడుస్తారు ఇక కొందరు. ఆమాట అనకే బాధను ప్రకటించి మనల నేడిపిస్తారు వేరొక కొందరు.

ఆషాఢ జలదంతో కవి తనను పోల్చుకొంటాడు. ఇద్దరికీ కన్నీరు కాల్వలే. ఆ కన్నీరు కార్చి ఇద్దరూ పుల్కరింప చేస్తారు. ఇద్దరూ కవులేనట! ఈ తరగతి

విలాపగీతాలలో ఈ కృతి కొక స్థానమున్నది. కాని కావ్యలోకంలో శాశ్వతత్వాన్ని సంపాదించుకోజాలిన వీరి విలాపకావ్యం "వరలక్ష్మి త్రిశతి." గిరికుమారుని ప్రేమ గీతాలలో 'భావి సంపన్న కవులు' తన గీతాల నేమను కొంటారో అని కాస్త సంకోచించాడు. కారణం ఆ విలాపము లౌకికస్థితిలో ఆగిపోవడమే ననుకొంటాను. అందులోనున్నది బాధా, ఆవేశమే తప్ప ప్రబుద్ధత కాదు. దుఃఖం మధ్యలోనే జీవుడు ప్రబుద్ధుడు కావాలి. అట్లా కానంతవఱకు నిర్వేదము నిర్వేదమే. శాంతిలేదు. కాని త్రిశతిలో అలాకాదు. నిర్వేదము, అందులో నిబ్బరమూ, అందులోనే శాంతీ, తానుపొంది వైదికంగా దృష్టిని భక్తిలోనికి మళ్ళించుకొన్నాడు కవి. ఇది ఆ జీవుని వేదనయొక్క పరిణామాన్ని, పర్యవసానాన్ని రసాత్మకంగా చిత్రించే ధ్వనికావ్యము, కాని ముందే చెప్పినట్లు అందులోనిది వారికి దుఃఖము. మనకు రసమూను. అందుకే కావ్య ప్రారంభంలోనే ఆయన వేడుకొంటాడు.

'ఓ సఖా! ప్రియభార్యావియోగ మెఱుఁగ
నట్టి యోపూర్వ సత్కృతీ! యకట! నీవు
కర్మ శతకంబు చదువకు మర్మఘాతి
నీ వెఱుఁగలేవు దానిలోని దగు...అని పైన చెప్పలేక కంఠం

గాద్గదికం చెందగా ఊరుకొంటాడు. ఈ కావ్యంలో మొత్తం 300 పద్యాలున్నవి. మొదటి వంద కర్మ శతకం. దీనిలో ఉత్క్రిమణం, ప్రాయశ్చిత్తం - దహనం-సంచయనం-ఇత్యాదిగా కృష్ణార్పణం, అట్టిప్రసాదనముదాకా పది పదులున్నవి. రెండవది స్మృతిశతకం. దీనిలో బెడిసిపోక, సనాతని, త్రైగుణ్యం - ఇత్యాదిగా మృత్యు విచారం, స్మృతికాని స్మృతి వఱకు పది పదు లున్నవి. ఇక మూడవది నిత్య శతకం. దీనిలో కవి ప్రబుద్ధు డవుతాడు. ఇందులో దుఃఖ నిత్యత, కర్మనిత్యత నిత్యతా నిర్ణయము, కఠము, కేనము, ప్రశ్నము, శ్వేతాశ్వతరము, మాండూక్యము, ఈశావాస్యము - చివరకు శాంతి పాఠము దాకా పదిపదు లున్నవి. ఇది ప్రశస్తమైన వైదిక రచన. భారతీయని దృక్పథము రసహృదయము ఇందులో చక్కగా ప్రకటింపబడినవి. కరుణరస ప్రధానము. శృంగార కరుణ రసాల మధ్య జరిగిన సంఘర్షణ ఫలితంగా మిగిలేది శాంతమన్న విషయ మిందు నిరూపింపబడ్డది. ఇది వినండి—

"నారాయణ నారాయణ
నారాయణ! దేవ! లోకనాథ! మురారీ!

నారాయణ! నారాయణ!
నారాయణ! కృష్ణ విశ్వనాథ! ముకుందా!

నా కనుగూళ్ళలో నమరి నావగు కన్నులు మాచుచున్నవా
నా కుటిలంపుమై నమరి నావగు ప్రాణము లాడుచున్నవా
నాకని చెప్పుకోను దగినట్టిది వస్తువు నిల్చియున్నదా
నా కృతమెల్ల నన్ను విడనాడక వెంబడించుచున్నదా.' (పుట-1)

నిర్వేదంలో శాంతిని గోరే ధీరుని ఆత్మావలోకన సందర్భంలో గోచరించే ధ్యానపారవశ్య మిందు గోచరిస్తుంది.

'నీవు వేలుపుటూరి వేవెల్గు రేకవు
కేవలమును మృదాకృతిని నేను
నీవు సదాచార నిష్ఠాయతాత్మవు
కడు దురాచార దుష్టుఁడను నేను
నీవు నిశ్చల మనోభావాభి రామవు
సరి; చంచలాతి చంచలుఁడ నేను
నీవు స్త్రీరూపమందిన గేహధర్మ మ
వొకరీతి కొదుగని యులిపి నేను

ప్రకృతి వచ్చమ్ముగా నీవు వికృతి నేను
నాపొనర్చు మహోఘసంతతుల నడుమ
నే సుకృతలేశ ఫలమొ; నాయిల్లు నీవు
లీలగాఁ గొన్నినాళ్ళు వెల్గించినావు.' (పుట 5)

'గేహలక్ష్మిగాను, అమృతవర్తిగాను' సీతాదేవిని సంభావించి విచారసాగరంలో మునిగిపోయిన భవభూతి రాముడు మనకు జ్ఞాపకమొస్తా డిందులో—

ఒక యెన్నో పుట్టుకలకు ముందరైన మ
త్ప్రారబ్ధ మీరీతిఁ బరిణమించె
నానా విచిత్ర జన్మ కృతాస్మదఘరాశి
అయి యయి నేటి కిట్లయ్యెఁ దుదకు
పితృదత్తమగు నాస్తి హతమయ్యె నాయందు
ఆయ నిచ్చిన భార్య యస్లైపోయె

నా తండ్రి చేసిన నానా మహాపుణ్య
కర్మ లీగతి గంగఁ గలిసిపోయె
మిగిలినది యొక్కడే నాకు మేరువంత
బరువు నా గుండెలో మధ్యభాగమందు
అంతె పేరున కంతె భార్యాస్థిగాని
నా శరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము.' (పుట 46)

ఇందులో కరుణ పరాకాష్ఠ నందుకొన్నది.

స్మృతిలో :

'నా యఖిల ప్రశస్తకవనంబున కాయమ పట్టభద్రురాలు' అనుకొంటాడు కవి. 'నీ వొక పెద్దవెల్గువయి నీ వెలుఁగారిన నాదు జీవితవ్యావృతి యీ కవిత్వమనునట్టి విచిత్రపు నీడ పారెనో దేవి'- అంటాడు.

ఏమైనా 'చేతముసోమ్మసిల్ల విరచించిన' దీకృతి!

'బహుసిద్ధాంతవిభూషితంబయిన యీ భాషాప్రపంచంబునన్
విహరద్భావరసానుకూల రచనావేశంబు దోసంబుగా
బ్రహరింపంబడి సంశయంపడెద దీవ్యత్త్వన్మహాకావ్య ని
గ్రహభీతిన్ గ్రహభీతి శారదికరాకాచంద్రబింబమ్మునాన్' (పుట 114)

అంటాడు. ఇట్టిదీ వీరి ప్రణయకవితాసామ్రాజ్యము.

ఇలాగే ఆవేశాత్మకంగా రక్తాన్నుడుకెత్తించేలాగ దేశభక్తి గీతాలనూ కవి యెలుగెత్తి పాడినాడు. పారతంత్ర్యంలోపడి దోగులాడే నాటి ఆంధ్ర ప్రజకు దేశభక్తి నుద్బోధించి ఆంధ్రుల ప్రశస్తిని, పౌరుషాన్నీ చాటి చెప్పవలసిన అవసరమేర్పడింది. అందరికీవలెనే ఈయనా అధికంగా ఆ విషయములో కృషిచేసి కృతకృత్యుడైనాడు.

ఆంధ్రపౌరుషములో నేటి ఆంధ్రజాతిపతనాన్ని తలచి, చింతించి, పూర్వౌన్నత్యాన్ని భక్తితో స్మరిస్తూ ఆ పతనానికేదో కారణముందనీ లేకుంటే అలాజరుగదనీ విశ్వసించి, తమకు తెలియకనే ఏదో ఆ జరిగిన అపచారాన్ని దిద్దుకోవాలనే ఆకాంక్షతో ప్రదర్శించిన వీరి దేశభక్తి ఆదర్శప్రాయంగా నిలిచింది.

'ఏకతమె యుండగావలె లేకయున్న
తెనుఁగుచురకత్తి పదునుకు తిరుగులేదు' అంటాడు.

ఆ తప్పు తెలిసికొని దిద్దుకోవాలనే ఆకాంక్ష నాడేకాదు. ఏజాతికైనా ఏనాటికైనా అవసరమే. కాక విఱ్ఱవీగిపోయిన ఒకనాటి ఆంధ్రుల పౌరుషం వీరి వృత్తాలలో - ముఖ్యంగా సీసాలలో - మళ్ళా విఱ్ఱవీగి బహుచమత్కార గతులనుబోయింది.

'ఒకనాడు గల దాంధ్రయువకులు తూరుపు
కనుమ దుర్గములనేలిన దినంబు
ఒకనాడు గలదు శిల్పకళా సరస్వతి
అమరావతిని నృత్యమాడు దినము' (పుట 1)

ఇట్లే—

'గోదావరీ పావనోదారవాః పూర
మఖిల భారతము మాదన్ననాఁడు
తుంగభద్రా సముత్తుంగరావముతోడ
కవులగానము శ్రుతిఁ గలయునాడు' (పుట 20)

వీరి ఆంధ్రప్రశస్తికూడ ఇట్టిదే— ఇవి రెండూ వీరరస ప్రధానములైన కావ్యాలు. సాతవాహనులనుండీ విజయనగరరాజులవరకూ మనవారికి గల ప్రశస్తిని స్మరిస్తూ వారి కీర్తిపతాకనిందులో పైకెత్తి నిలిపినాడు. ముఖ్యంగా దీనిలో వేఁగీక్షేత్రం, ముఖలింగము - మరీ అధికంగా కొండవీటి పొగమబ్బులు ప్రశస్తములైన ఖండికలు. ముఖ్యంగా వేగీ క్షేత్రాన్ని వర్ణిస్తున్నప్పుడు కవి నిజంగా భావావేశంలో స్తంభించిపోతాడు. 'శిలవోలెఁ గదలంగ' లేకపోయితి నంటాడు.

అస్వతంత్రత బాధాకరమనీ 'అస్వతంత్రతా నియతమైన యీ బ్రదుకు తెన్గువారు భరించలే'రనీ కంఠమెత్తి చెప్తూతా డీ కవి.

ఇందులోని 'కొండవీటి పొగమబ్బు' లత్యంతసుందరమైన రచన. ఒకసారి కవి కొండవీటికేగి అక్కడి పాడుబడిన కోటగోడలపైన తెగలుకట్టి సయ్యాటములాడుతున్న పొగమబ్బులను చూస్తాడు. అతని కంటిముందు ఒక సినిమా సాగిపోతుంది—

'నాప్రాణములకాను నీ పొగమబ్బుల
కేమి సంబంధమో యేనుగూడ
పొగమబ్బునై కొండ చిగురు కోనలపైన
బురుజులపైనఁ గొమ్ములకు బైన
వ్రాలిపోనో, మధ్య ప్రీలిపోనో, నేల
రాలిపోనో, గాలి తేలిపోనొ
నా యూహా చక్రసుందర పరిభ్రమణమై
యీ పొగమబ్బులనే వరించె

ఎన్ని పొగమబ్బు లెజిఁగిలే నేను మున్ను
తూర్పుకనుమలు విడుచు నిట్టూర్పు లట్టి
విచటి యీ పొగమబ్బు లేయెడఁదలోని
లలితము మదీయగీతి నెలా వెలార్చు' (పుట 54)

అంటాడు. ఇది పద్యంకాదు. ప్రతిభాసంస్కారాలు వడబోసిన తేనెపాట; ఈ ఒక్క ఖండికే చాలు వారి 'ప్రశస్తి' నిలబడడానికి! ఈ దేశభక్తిని ప్రతిపాదించడంలో సుపరిచితములేని నాటి చారిత్రిక పరిజ్ఞానమువలన దొరలిన ఒకటి రెండు దొసగులను నేటికి దిద్దవలసివున్నవేమో. మాధవవర్మ పల్లవుడంటాడు. కాడు, విష్ణుకుండిన వంశీయుడు. 'గణితశాస్త్రాంబుధి ఘనుఁడాతఁడే పావులూరి మల్లన కవిలోకగురువు' అంటాడు. నన్నయనాటి కాతడు చిన్నవాడే. కవిలోక గురువు కాలేదేమో, అయినా ఇవి ఒకపాటివి కావు.

## ప్రణయము-దేశభక్తి-తర్వాత-ప్రకృతి వర్ణన

శ్రీ సత్యనారాయణగారి ఋతుసంహారము తెలుగు సాహిత్యంలోనే విశిష్టమైనది. ఆముక్తమాల్యదాకారుని తరువాత తెలుగు ఋతువులను తీసికొని చక్కగానూ, అంత కెక్కుడుగానూ కూడా వర్ణించినకవి యీతడే. మునుపు చెప్పిన ఆదర్శనవర్ణనాత్మకశక్తులు పండబారితేగానీ ఇట్టి సత్యసుందరమైన సహజ కవితాస్రవంతి జాలువారదు. ఋతువు లారు. ఆరింటికి ఆరు పదు లరవై సీసాలలో తెలుగుదేశాన సంవత్సరంపొడుగునా ప్రతిమనిషీ చూడగలిగే విశేషాలన్నీ చూపించాడు. అన్నీ మనచేత చూడబడేవే. కానీ మనం వాటి నేనాడూ పట్టించుకొనికూడా వుండం. కవితావస్తువు లవి కాగలుగుతాయని కూడా

అనుకొనివుండము. అట్టివానినే గ్రహించి, ఆ కవి ప్రదర్శించేసరికి ఋతువు సాక్షాత్కరించి, మరపురబడిన ఏవో సహజ చిత్రాలు కనులముందు మెరసినట్లే ఆహ్లాదాన్ని కలిగిస్తవి. వసంతం చూడండి. చిరుచెమటలు, మల్లెమొగ్గలు, వేప పూతలు, మామిడి చివుళ్లు, కోకిలల కూతలు, నేలలో బడ్డ నెటియలు, వట్టివేళ్లు, గందవొళ్లు, వైశాఖపూజకు వెళ్లే బ్రాహ్మలు—వారి సందళ్లు—ఇత్యాదులన్నీ కళ్లకు గట్టినట్లు వర్ణిస్తాడు. కురుల కుదుళ్లలోకూడా చెమటపోసిన వైనం ఆయన కలానికి జ్ఞాపకం. ఆ ఋతువులో తెనుగుతోటమాలి ఏమి చేస్తాడో ఆయన వ్రాస్తాడు. ఎప్పుడు చూచాడో ఈ కవి ఇవన్నీ అనిపిస్తుంది చదువుతుంటే. మనదేశంలో పల్లెపట్టులు, పంటపొలాలు, తోటలు, బాటలు, ఒకటేమిటి ఈయన దృష్టిని తప్పించుకొన్న దృశ్యమంటూ ఈ కావ్యంలో లేదు. ఇవన్నీ చదువుతూంటే, ఎప్పటి సంస్కారమో తెలియదుకాని, ఈయనలోని కమ్మదనం చక్కగా పద్యాలలోను, భావాలలోను కనిపిస్తుంది.

చక్కని నిశితమైన ప్రకృతి పరిశీలనాజ్ఞానంతో, సంప్రదాయ మెరిగి, దానికి తోడ్పడే పలుకుబడితో, భాషాపాటవంతో ఋతువుల నాయన చిత్రించాడు. గ్రీష్మంలో కనిపించే పశులు, జంతువులు, వాటి స్థితులు, బాట ప్రక్కనే చెట్లనీడలో పురికొన లాగడంకోసం లంబాడీలు పాతుకొన్న పంగల కొయ్యలు, సమీపంలో బ్రహ్మదండిమోళ్ళు, కాళ్ళలో గ్రుచ్చుకొనే గరిక తలలు, అగ్ని ప్రమాదాలు, ఆకాశము భూమి అగ్నిపత్రం వ్రాసికొన్నట్లు రేగే సుడిగాలులు వర్ణిస్తూ, వీటితోబాటు చూడండి ఎండవేడిమికి కాబోలు చిబుకమ్ము చివర వేసిన సెగగడ్డకు కోలవారిన బాల గుండ్రమొగాన్ని కూడా వర్ణిస్తాడు. ఆ వర్ణనలోని యాథార్థ్యం ఎప్పుడైనా ఆ దృశ్యం చూచియుండిన వారికే తెలుస్తుంది. ఆశ్చర్యం!

వర్షం చూడండి

'అంతః ప్రగర్జన్మహాంభోధరమ్ములు
నశని పాతోగ్ర ఘోరాంబుదములు
మత్త సామజవదుద్వృత్త జీమూతముల్
నీల నమ్రస్నిగ్ధ నీరదములు
శంపాప్రగాఢ భాస్వత్పయోధరములు
ప్రౌఢధారా వమద్వారిదములు...

రచనను కళ్ళుమూసుకు వింటేనేచాలు. కారుమేఘాలు కదలి వస్తున్నట్లుంటుంది. ఎలుగుబంట్లు, కారెనుబోతులు గములు కట్టినట్లు వచ్చే ఆ మేఘాలు; 'కోపచండము కొరడాపెట్టి మొగమున నడ్డమ్ముగా కొట్టినట్లు మెరిసే మెరుపులు—పందిరిగుంజకు పట్టిన కుక్కగొడుగులు, చిక్కుడు, బీర మొక్కల ఆకుల చివళ్ళ ఇంద్ర గోపాలు, గంగరావిపూలు, వాననీళ్ళల్లో వదలిన పిల్లల కాగితపు పడవలు. పొయ్యి మండించడానికి పడే అగచాట్లు అన్నీ ఒళ్ళు పుల్కరించేటట్లు వర్ణిస్తాడు. 'నావికులు, ప్రకృత్యర్థనిర్ణాయకులు, సుకేళినిధులు, జోస్యులు తెన్గు బాలకులు వానలోకాలనుండి వచ్చి నడయాడుచున్న దేవత' - లన్నాడు. ఎంతో సబబుగా వుంది ఆ మాట!

ఇక శరత్తు - 'ఱెక్కలు చాచి తీరికగాగ గాలిలో తేలిపోయెడు నంచవోలె వస్తే - కొల్లేటి కొంగలు మాలాబద్ధములుగ వచ్చిన'వట! అవి మిన్నను పాములచిన్నదాని గళాన నత్తగుల్లల పేరనంగ మొరసినవట.

'పలుచని బురదలోపల మానిసిని జూచి
నెగచి యూఁకున దూకె నీటిపాము
వెలివడ్డ బొరియముంగల నిక్కి తెల్లబో
యెను గొంగ కెఱగాని యెండ్రకాయ'—

ఇలాగే - 'అనిలాహతి తబకలాడ నొడ్డులు మోచి క్రొత్త నీరము పెట్టుకొన్న చెరువు' మొదలుకొని 'శరద్వేళ మాగాడి పల్లెటూరు' దాకా అంతా కళ్ళకు గట్టిస్తాడు.

'బురద తొక్కడు కాపు బుడతడు మహిషంబు
పై స్వారి బోవును బాలయముడు.'

అల్లే - చీడనూగైన మిన్నకాడను నాజూకైన దూడ మూచూడదట.

అబ్బ - ఏమి పరిశీలన—

ఇక హేమంతంలో మంచు బిందువును వర్ణించిన పద్యమే పద్యము.

'తట్టలో గూర్చుండబెట్టిన వధువునా
గుమ్మడిపూవులోఁ గులికె నొకటి
ఖండితాపాంగసక్త నవాంబుకణమునా
ఘాసాగ్రమున యందు కదలె నొకటి

తులసి మ్రుగ్గుననిడ్డ తొలుకాడు దివ్వెనా
సాలీని పటముపై సాగె నొకటి
ఘూర్జరీ ముఖలంబి కొసము త్తియంబునా
నా దూడ నొసటిపై నాడె నొకటి
మధువు నా బూవుఁ బూవున మసలె నొకటి
జగ్గుగా నాకు నాకున జాఱె నొకటి
మంచు బిందులు నవసుకుమారమూర్తి
మంతములు ప్రాతరంత హేమంతవేళ—'

నిగ్గుదేరిన కవి యూహ కిది రసఫలము, శిశిరంలో చూడండి. కుడితి తొట్టిపై దవుడు నాలుకలాగి ముట్టి ముంచని చూలు మొదటియావుని; ప్రక్కపై యుడిన దుప్పటికూడ నిద్రలో కొని కప్పుకొనే కుఱ్ఱవాణ్ణి; పాడియా వీనగా పంటకాపు పెండ్లము -పసిదూడ కొనకాలి గిట్టలు గిల్లే దగ్గరనుండి- జున్ను తినేదాకా వారి రాత్రి జాగరమును; కుదుపలు కుదుపలుగా పేరుకొన్న కొబ్బరినూనెని; ప్రత్తికాయలల్లే పగిలిన పెదవుల్ని, పాడిబఱ్ఱెలపొదుగు పగిలితే పాలు తీసేటప్పుడు అడ్డముగా తిరిగి తన్నడాన్ని; మునగచెట్టుకి పట్టిన కంబళి పురుగుల్ని; పిల్లలు నేపాళపుకాయలలో చలికంతం చూచుకోవడాన్ని ఇట్లాగే ఎన్నో విషయాలను సహజాతిసహజంగా చిత్రించా డీ కవి. కవిత కిదేవస్తువు. ఇదికాదు అని లేదుకదా! కవి ఉత్తముఁడైనపుడు చూడలేనిదీ-గ్రహింపరానిదీ అసలుండదుకదా!

ఇలా స్వజనంమీదా స్వదేశంమీదా ప్రకృతిమీదా చెప్పిన మూడు విభాగాలలోను ఈయన కవిత ఉత్తమంగా సాగినది, ఇవికాక తెనుగుసాహిత్యం లోనే క్రొత్తబాట- ఈ మూడు భావాలను అంటే Love for the beloved country and nature- ఒకే మూసలో కరిగించి పారించిన క్రొత్తపాట-కిన్నెరసాని పాట - ఇది ఒక మధురాతి మధురమైన గేయము.

కిన్నెర ఒక చిన్నవాగు. కాని అందచందాలు చిందులాడే దాని ఒయ్యారపు నడక చూచేవారిని ఆకర్షిస్తుంది. చివరకది గోదావరీ సంగమం చేసి సముద్రంలో కలుస్తుంది. తన దేశంలోని ఒకానొక ప్రకృతి దృశ్యాన్ని రచనావిషయంగా గ్రహించి, దానికొక ఇతివృత్తం కల్పించి, కిన్నెర పుట్టుక-నడకలు - నృత్యము - సంగీతము - కడలిపొంగు - కిన్నెరదుఃఖము - గోదావరీ సంగమము - కిన్నెరవైభవము మున్నగు తరంగాలతో ఇంపుగా నడిపించారు

కవి. భావశబలతకు - రసపుష్టికి - అనుగుణంగా మాత్రాచ్ఛందస్సులో, వింత గతులతో, గేయానుసారంగా, అనుప్రాసవిన్యాసంతో, భాషాసౌలభ్యంతో. వ్యావహారికంగా వినుగుపుట్టించకుండా చక్కగా నిర్వహించాడు.

నడకల వరుస వినండి :

'కరిగింది కరిగింది
కరిగింది కరిగింది
కరిగి కిన్నెరసాని వరదలై పారింది
తరుణి కిన్నెరసాని తరకల్లు కట్టింది
పడతి కిన్నెరసాని పరుగుల్లు పెట్టింది-

దాని నృత్యము చూడండి :

'కెరాటలలో నుర్వు
తెరచాలులో నీటి
హారజాలులో కిన్నె
రటు కదలి యిటు కదలి
చిటితరంగాలతో పొటితరంగాలతో
నటనాలు మొదలెట్టెనే - క్రొన్నీటి
తుటుములా కదలాడెనే—'

ఇత్యాదు లందులో కొన్ని మధురగతులు. ప్రణయమూ, విలాపమూ ప్రకృతిమీది ప్రీతీ - తను దేశపు నదులను కీర్తించడంద్వారా దేశభక్తి - దీనిలో ఉండడమూ, గేయాత్మకముగా నడవడమూ, దీని విశేషము. ఇట్టిదే మరొక యత్నము 'కోకిలమ్మ పెళ్ళి' - అన్న గేయకృతిలో ఈ కవి చేశాడు. కాని ఆ యత్నమున కవి విఫలుడైనాడని తోస్తుంది.

'లేతబుట్టలు వెక్కిరిస్తే
ఆతగాళ్ళతో ఏమిగానీ
తాతతాతల నాటి కథలు
తవ్వి పోస్తానోయ్—'

అని ప్రారంభించిన ఆ గేయము అనుకరణతో - తెచ్చికోలుతనంతో - కుంటు పడే నడకలతో - కవితాసంప్రదాయానికే దూరమై వున్న దా రచన. ఒక్క మాటలో పేలవంగా వున్నదనవచ్చు.

దీని తర్వాతది భక్తి: ప్రణయపారమ్యము భక్తిలోనే ఉంటుందని ఇందాక చెప్పాను. అట్టి భక్తే పారవశ్యంలో ముంచి భక్తున కెప్పుడూ రసానందాన్ని సంధానింప కల్గేది. ఆ భక్తిలో భక్తుడైన కవి తన మేనే తానెరుగడు - తన మనస్సు, తన వాక్కు కూడా భగవచ్చింతనలోనే లీనమవుతవి. ఆ స్థితిలో ఒక్కొకసారి రసభావాలేవీ లేని స్తుతిమాత్రమే మిగులవచ్చు - లేదా - అనంతమైన భావ వైవిధ్యంతో ఒప్పి మోహనమూ కావచ్చు. 'రూపా ఏకథా అపి ఏకాదశథా భవతి' అని నారదు డన్నట్టు పలుతెరగుల భక్తి ప్రకటితం గావచ్చు. అట్టి భక్తిరసపూరితమైన విశ్వేశ్వర శతకం శ్రీ సత్యనారాయణగారి రచనలలోకెల్ల మకుటాయమానమైనది. తల్లిదండ్రులు తన కిచ్చిపోయిన సంపదలు కట్టుకొన్న భార్య ఒకటి - ఈ దైవ మొకటి. ఇద్దరినీ ప్రాణంతో సమానంగా ప్రేమించుకున్నాడు. విశేషమేమంటే అందొకటి లౌకికము మరొకటి దివ్యమూను - జీవితంలో ఏదైనా కష్టం వస్తే ఆయన కుచ్ఛ్వాసం కొల్పే పదార్థాలు సృష్టిలో అవి రెండే. అందుచేతనే వాటిమీద ఎక్కడలేని మక్కువ; చనవు; స్వాతంత్ర్యము; విశ్వాసము; చివరికి భక్తీని! వాటిని తలచుకు తలచుకు కవి తన్మయుడై వెఱ్ఱివాడై పోతాడు. నిర్భయంగా, స్వేచ్ఛగా, మౌగ్ధ్యంతో మాట్లాడుతాడు. దీనంగా విలాపిస్తాడు. అలంకారాలొలకబోస్తాడు. చమత్కరిస్తాడు. నిబ్బరం చూపుతాడు. ఇంకా ఏమేమో అవుతాడు. అనంతమైన ఆ భావవైవిధ్యం చెప్పతరం కానిది.

'నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవమ వేను భక్తుఁడను తండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను గర్షకుఁడ తండ్రీ! నిన్ను బండించెదన్
నా వైదుష్యము నీవెచూతు కృపసంధానించు విశ్వేశ్వరా!' (పుట-1)

'నిన్ను శ్రీనాథాది మహాకవు లెందరో వర్ణించారు. ఇప్పటికి నన్మత్ స్తోత్రపాత్రుండవై తేనెల్ ద్రావిన నోటికిం జలము లందింపయ్యె విశ్వేశ్వరా!' అని తనను తానే తక్కువ పరచుకొంటాడు. ఇంతలోనే స్వామి తనను అనుగ్రహించడంలేదని దైన్యం క్రమ్ముకొంటుంది. వెంటనే ఆవేశమూ వస్తుంది. స్వామిని నమ్మబట్టియే తన కీగతియట! తండ్రితో ఆస్తిపోయినది. 'నా పేదరికానికి నీవే కారణ' మని స్వామిని నిగ్గదీస్తాడు.

"మీ దాతృత్వమె తండ్రి దాతృతయె మీమీమధ్యమున్నట్టిలా
వాదేవీలకు నాదుబాధ్యతకు సంబంధంబులే దిట్లు రా!

ఏదో లెక్కలు తేల్చుకో! మొఱటుతో నేలా ? యొడల్ మండెనా
ఏదో వచ్చినకాడి కమ్మెరదను సుమ్మీ నిన్ను విశ్వేశ్వరా !" . (పుట-7)

తీరా అంతమాటా అని స్వామి పలుకకుంటే అపచారం క్షమింపుమన్నట్లు—

'స్వామీ ! యేలనయా బహూక్తులు నినుఁ బ్రార్థించుచున్నాను రెం
డేమాటల్ సిరులిచ్చి వ్యర్థజనులందే సేవచేయించ కె
ట్లో మాన్పింపుము, కాదయేని మృదుపాండుశ్రీనవచ్ఛాయలో
నీమై దీధితిలోనఁ జేర్చుకొను తండ్రీ! నన్ను విశ్వేశ్వరా !' (పుట-9)

అని ప్రార్థిస్తాడు. ఆయన ఎన్నడు సాక్షత్కరిస్తాడా అని వాసకసజ్జికవలె సిద్ధుడై కవి ఎదురుతెన్నులు గాస్తాడు. కాని, ఆ స్వామి చమత్కారమేమిటో మన కర్థంకాదు. ఆయనచేతి బొంగరాలం మనం. మనలను గిరాట్లు పెడుతూ ఆయన ఆనందిస్తాడు.

నూటికినూరుపాళ్ళూ ఈ శతకంలో వీరి కవిత ప్రశస్తంగా ఉంది. చివరికి-

'తేనెల్ వారును మేఘగర్జనలు వీతెంచుఁ బికీ కన్యకా
నూన వ్యాహృతి మాధుపంచమము చిందుఁ ద్యోనదాంభఃకణ
శ్రీనృత్యమ్ములు సూపు నాకవిత తండ్రీ! నాహృదంభోజ మం
దానంద చ్యుతి పొంది నీ శతకమి ట్లుపోయె విశ్వేశ్వరా' (పుట-15)

అనుకొంటాడు.

వస్త్వాశ్రయకవిత : ఆత్మాశ్రయ కవితయే శ్రీ సత్యనారాయణగారి లఘుకృతులలో అధికమైనప్పటికి ప్రబంధధోరణిననుసరించి వస్త్వాశ్రయకవితను కూడ ఈయన తన చిన్నికావ్యాలలో ఆవిష్కరించకపోలేదు. వాటిల్లో వల్లీసేన విజయము, ఝాన్సీరాణి, పాముపాట, గోపాలోదాహరణము— ఇవే నా ఎరుకలో నున్నవి. ప్రచండంగా ఆయన సాగిస్తున్న కవితాతపస్సులో నప్పు డప్పుడు ఆయనకు చేజిక్కిన కొన్ని కాయసిద్ధులులాంటివి ఈ లఘుకృతులు. దానిలోవలె వారి మనస్సంతా లగ్నంచేసి అభినివేశంతో రచించినవిగా నాకు తోచవు. అయినా సహజంగా శిల్పి కాబట్టి కథాకథనంలోను, రచనలోను, చమత్కారము, సామర్థ్యము ప్రకటిస్తాడు.

వల్లీసేనవిజయము : దీనికే 'కుమారాభ్యుదయ' మని పేరు. స్కాందం నుండీ, భారతంనుండీ ఇతివృత్తాన్ని గ్రహించి ఈ కృతిని క్రొత్తగా ఆరు ఆననాలుగా తీర్చాడు. అనగనగా అరిష్టనేమి అనే దానవుడు, వానికి చిత్రసేన, దేవసేన ఇద్దరు కూతుళ్లు;—ఒకసారి ఎవరో రాక్షసుడు దేవసేనను అపహరించుకు

పోతుంటే ఇంద్రుడు కాపాడి ఆమెను పెంచుకొన్నాడు. కుమారస్వామి శూర పద్మాసురుణ్ణి చంపినందుకు మెచ్చి ఆమెనిచ్చి కుమారునకు వివాహంచేశాడు- అని పౌరాణికంగా ఈ కథను చెప్పక ప్రణయంతో ప్రారంభించి జన్మకథాదికము మధ్య చెప్పించి, ఆవిష్కరణములో ఆధునికత చూపాడు. పద్యరచన ప్రబంధధోరణిలో సాగింది. నాచన సోమన, పెద్దనాదులు కనిపిస్తారీ కావ్యంలో. అంతేకాక సమకాలిక భావాలు - రచనలు కొన్ని అందులో ధ్వనిస్తాయి. గురజాడవారి 'దేశమంటే మట్టికాదోయ్' కూడా ఒకసారి ప్రస్తావిస్తాడు. ఇక చతుర్థాననంలో గాంధీ, వినోబాల, సామాజిక ఆశయాలు, సర్వోదయ భావాలు స్ఫురిస్తాయి. ఇందులోనే దీని నవ్యత.

ఝాన్సీరాణి :

ఈ కవి తీసికోలేని విషయమంటూ, వ్రాయలేని వస్తువంటూ లేనేలేదని ముందే చెప్పాను. ఎవరేది అడిగినా గంటలలో అద్భుతంగా అల్లిపారవేసే ప్రతిభా వ్యుత్పత్తు లీయన దగ్గరున్నవి. ఝాన్సీరాణి అందుకు తార్కాణ. అంకితంలో- 'మతిదివిషద్గురుఁ నను సమాహితచిత్తు ననంత కల్పనాచతురుని దేశభక్తిగుణసాంద్రుని నిత్యసరస్వతీకుఁ'-అని చెప్పుకొన్నమాట సత్యాదూరం కాదు. ఈ కావ్యంలోని ఇతివృత్తం ఇప్పటికి దాదాపు వందయేండ్ల క్రితంనుండి మొన్నమొన్నటి దాకా జరిగిన భారత జాతీయ స్వాతంత్ర్య సమర నాటకంలో తొలిరంగం. నాటి బ్రిటిషువారి దురంతాలను చెడనాడి, వారికి బెబ్బులిగాను, సింహస్వప్నంగాను తోచిన భారత వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి జీవిత సమరం ఇందులో చక్కగా తొమ్మిది ఆశ్వాసాలలో తీర్చబడ్డది. ఇందు కవి స్వేచ్ఛగా బ్రిటిషువారిని చెడనాడుతాడు. 'నిన్నటిదాక వర్తకులు నేటికి ధారుణి నీతివేత్తలుఁ- నిన్నటిదాక యాచకులు నేటికి రాజ్యరమాధురంధరుల్ !'—వారు నీచులనీ, పాపులనీ చెప్పి, వారికేమి ప్రాణప్రయాణ సమయంలో confession ఉందికదా ఫరవాలేదు అంటాడు పరిహాసంగా.

'ఇంత బరిణలోన నిమిడెడు సన్నని
యారు బారచీర దారములను
బట్టి తీయునట్టి పనివాండ్ర బొట్టన
వ్రేళ్లు నరికినారు వీరజాతి!'

అంటాడు. 'తనవంక నిర్భయంబుగ జూచెనని యెంచి ఒక డొక్క భారతీయుని

వధించె' నట! 'క్రొత్త తుపాకి మ్రోగునో లేదో యని చూడ నొక డొక్క భారతీయుని వధించె' నట- ఇట్లా రచనలో ఉద్రేకం నూరిపోశాడు. 'అతిథిగ వచ్చె జోరుడు గృహస్థు నెజంగియు నక్కటా' అని సిట్టూరుస్తాడు. ఇట్టి ఉద్రేకపూరితమైన రచనతో కవి భారతజాతీయసమరాన్ని స్మరిస్తాడు. చివరికి- 'నా వసుధ వందయేండ్లు నిండవు ఫరంగి' కనుచు శపియించె రాణియుఁ గసులు మూసె—నంటా డీ కవిఋషి. రాణినోట వీరి నేటిమాట వందయేండ్లకు పూర్వమే చెల్లిపోయింది కదా!

**పాము పాట :**

'వంగకవి జగచ్చంద్రుని
సంగీతాత్మయుఁ బోలెఁ దె
లుంగు కవి జగచ్చంద్రుని
సంగీతాత్మయు - నీ యెడ నీ కృతిగా

జాలువారింది. ఇది ఒక సంగీత రూపకం. సౌరాష్ట్రదేశపు రాజుకూతురు త్రైలోక్యసుందరిని కాశ్మీరదేశపురాజు చిత్రాంగదుడి కొడుక్కిచ్చి పెళ్ళి చేస్తాడు. ఆ పెళ్ళి మొదట కత్తికిజరుగుతుంది. యదార్థంలో పెళ్ళికొడుక్కి మానవరూపం లేదు. అత డొక పాము. ఆ సుందరి ఆ పామునే భర్తగా గ్రహించి భరిస్తూ అత్తమామలు చెప్పినట్లు పుణ్యక్షేత్రాలు తిరుగుతుంది. దారిలో ఎందరో పడతులు నీ మగడు పామంటూ ఉంటారు. ఇట్లా తిరుగుతూ అరణ్యంలో ఉండగా ఒకతూరి ఒక ఋషి పూర్వపు శాపవృత్తాంతాన్ని చెప్పి బ్రహ్మగుండంలో మునిగితే మానవాకారం తిరిగి రాగలదని చెప్పుతాడు. అలా చేస్తారు. శాపంతీరి సుఖంగా దాంపత్యం అనుభవిస్తారు. ఈ కృతి వారి నాటికల్లో చేరవలసిందే అయినా సంగీతరూపకం - పాట - కాబట్టి ఈ ప్రసంగంలో నేను గ్రహించాను. ఇందులో ఆడవాళ్ళ ప్రశ్నలు - వారి పరిణామాలు - మనస్తత్వాలు చక్కగా చిత్రించాడు కవి. యిందులో గేయరచనలోను విసుగు లేక గతులు మారుస్తూ రచనకు రక్తి కల్గించాడు.

ఆ భర్త పామైనా మెడను చుట్టి బుసలుకొడుతూ ముద్దాడి ఇల్లాలిని నానా హింసలూ పెడతాడు. అప్పుడు సుందరి—

'పామైన నీతోనె బ్రతుకలేకున్నాను
ప్రభు! రాచబిడ్డవై బ్రతుకనిత్తువె నన్ను.'

అంటుంది. కథలో సందర్భానుసారంగా వేదాలలోని 'తొలిసృష్టి పాములయ్యెన్

నిజముగా మలిసృష్టి మనుజులయ్యెన్' అన్న కథ కూడా చెపుతాడు. చమత్కార మైన చిన్నపాట ఇది.

ఈ తరగతి కృతులలో పేర్కొనవలసి మిగిలిపోయినది మరొకటి గోపాలోదాహరణము. ఇది పరమరాజకీయవేత్త యైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి వివాహసందర్భంలో వారి నుద్దేశించి చెప్పిన ఉదాహరణం. 12, 13 శతాబ్దులలో పాల్కుర్కి సోమనాథుడు ఆరంభించిన ఈ నూత్న వాఙ్మయ ప్రక్రియ నీ యుగంలో కొనసాగించిన కవులలో వీరొకరు. మామూలుగా ఉదాహరణ కావ్యాలన్నీ ఆత్మాశ్రయ కవిత్వమనే విభాగంక్రిందే వస్తవి-కాని ఇది కేవలం మనుష్య ప్రశంసతో కూడుకొన్నది కాబట్టి భక్తి అన్న మార్గం నుండి జారిపోయి పరాశ్రయకవితగానే నిలిచిపోయిందని నా భావన. అందుకే ఈ కృతి నిక్కడ స్మరించాను—

ఇంతవరకు వారి వస్తుకవితను చవిచూచాము. ఇక మిగిలినదెల్లా వారి చాటువులు విడివిడిగా వ్రాసిన కొన్ని ఖండికలూను. ఇటీవల వారి చాటువు లన్నీ కలిపి 'విశ్వనాథపంచశతి' అన్న గ్రంథంగా వెలువడ్డవికూడా. ఇది ఒక అపూర్వమైన కావ్యం. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నమాటచొప్పున ఇది బహు కావ్యసముచ్చయం అనాలి. ధ్వని, వ్యంగ్యము, చమత్కారము, దండిగా గల్గి శృంగారం మొదలుకొని హాస్యందాకా-నన్నయ్య భాషనుండి నేటి పత్రికల భాషదాకా-ఒకటేమిటి! కంటికి కనుపడిన చేతికివచ్చిన ప్రతి విషయాన్ని దులిపి పారవేశాడు. ఆ పుస్తకం వారి అభిప్రాయ వేదిక. తాను ఇతరులను నర్మంగా విమర్శించాడు. తనమీది విమర్శనకు సమాధానం చెప్పుకొన్నాడు. అన్నీ ఇందులోనే—

తొలినాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి యీనా
ళుల వ్రాసిన కవిదోషము
కలి ముదిరినకొలది చిత్రగతులను నడచున్.

పండితమ్మన్యులపై దెబ్బ—

పండితులె యెల్లవారు 'కావంతి' యనుచు
నడుగ నొక్కడు చెప్పలేడనియె నతడు
మఱియు సందర్భమే మన 'మనుచరిత్ర'
లోని దనియెను 'మాయాద్వార' పైనిమాట!

అభ్యుదయ రచయితలపై విసురు వినండి :

చిత్తమును నిల్పుకోలేక చిలుముపట్టి
రైలు టిక్కెట్టులేని బైరాగి యయ్యె
మదికి నిర్దుష్టభాష నమర్పలేక
యభ్యుదయ మార్గమూని హాస్యకవి యయ్యె.

తెనుగు సినిమాలమీద దెబ్బ :

ఈ తెనుగు సినీమాలకు
బ్రాతిగ గొనిపోకు పిల్లవానిని వీడుఁ
బూతులను నేర్చుకొనియెడు
చేతోమర్యాదలేని చీదరమాటల్.

పత్రికలపై చేసిన దండయాత్రను గమనించండి :

అంటబోకుమొక్క గవర్నమెంటు మాత్ర
పడనుదిట్టుము నీయిచ్చవచ్చినట్లు
కొంచముగ నొజ్జగా నెక్కుకూడ కలుపు
పత్రికల యమ్మకము నాజవాబుదారి.

తేలికగా కీర్తినాపాదించడానికి మార్గమాట :

చెలగి నీకును కీర్తి నార్జించునట్టి
ప్రతిభలే దొక్క చక్క.ని బాటకలదు.
శక్తికలిగి యెవ్వడు ప్రతిష్ఠకునెక్కు
వానితోనీవు పత్రికావైరమూను.

ఆంధ్రేతరుల ఆంధ్రభాష -మనవాళ్ళదోహదము- వీరిదృష్టిలో చూడండి :

మిషనరీలు రైల్వేవారు మేటిపత్రి
కలును పాలించుచున్నారు తెలుగు భాష
తురకలును సినీమాల యింతులును రేడి
యోచతురులు తీర్తురు తెలుగు వాచకంబు.

మొత్తంమీద శృంగారం వెట్టిమోతాదులలో సగం పుస్తకముంది. ఉదాహరించ నవసరం లేదనుకుంటాను.

ఇలాగే ఆయన అప్పుడప్పుడు వ్రాసిన వానిలో కొన్ని గేయాలు - కొన్ని ఖండికలు కూడా వున్నవి. వాటిల్లో కన్నె కాటుకకళ్ళు, చిన్నినాథుని చూచి, మెదలగల చిన్నిమబ్బులు. జానిసల సముద్రము, మూగనోము



ఇత్యాదులు ప్రశస్తములు. రసము, సంప్రదాయము చక్కగా పోషింపబడ్డవి వాటిల్లో. అలాగే దయ, నిర్దయ, రెండు నక్షత్రాలు మున్నగు ఖండికలూ లోకోత్తరములైనవి కొన్ని వున్నవి. వానిలో ఒక్కొక్కటి ఒక మహా కావ్యము. వాని రచనలో సూటిదనము, సంక్షిప్తత భావదార్ఢ్యము, సందేశము, కల్పనాశక్తి, అపూర్వమూ-ఆశ్చర్యజనకమూను.

ఇంతవఱకూ కవిగారి లఘుకృతులను స్థూలంగా పరామర్శించుకు వచ్చాను. అసలీయన కలంలోనే ఒక వింత వున్నది. వీరి పలుకుబడిలోను, భాషలోను, వాక్యనిర్మాణ వైఖరిలోను, కథాకథనంలోనూ ఏదో అనిర్వాచ్య మైన ఒక మాధుర్యము, ఆకర్షణ ఉన్నది. అదే మనలను చాలావఱకు లాగుకొని పోతుంది. ఆశక్తితోనే కవి మనలను ఒకొకసారి చదవడానికి ఉబలాటపెడతాడు, ఒకొకసారి బలవంతపెడతాడుకూడాను. Eliot 'genuine poetry is that which conveys before it is understood' అన్నాడు. అలాగే కోలరిడ్జి 'not the poem that we have read out that to which we return possess the genuine quality of poetry.' అన్నాడు. నిజంగా వీరన్నట్లు అదే ఉత్తమకవిత్వాని కొక లక్షణం అయినట్లయితే ఆతీరుగా కూడా శ్రీ సత్యనారాయణగారి కవిత ఉత్తమమైనదే అనవచ్చు. ఎందుకంటే వీరి కవిత చాలవఱకు చదువుకుపోతుంటే అర్థమయ్యేలోపుగానే- కాదు- మనం అర్థంచేసికోగల్గేలోపుగానే భావం స్ఫురించి పోతున్నట్లుంటుంది. కాని తీరా అన్వయంతో సహా అర్థం చెప్పుకొందామంటే ఒకొక్కసారి సాఫీగా లేక గడబిడగా ఉన్నట్టుంటుంది. ఆ రచన అంతే. ఈయన కొన్ని moods ని కల్పిస్తాడు రచనలో- దాన్ని అనుసరించుకోగల్గినప్పుడే భావంలో గాని, రచనలోగాని మన కన్వయం కుదురుతుంది. లేకుంటే ఒక్కొక చోట మొండిగానే ఉన్నట్లుంటుంది. భాషలో ఈయనకున్న అధికారం మరె వ్వరికీ ఈ యుగపుకవులలో కానరాదనడం అతిశయోక్తికాదు. గుండె గుభేలు మంటుంది. ఈయన వ్రాస్తుంటే వస్తువెంత పాతదయినా రచనలోనే ఈయన నవ్యత, శిల్పంలోనే ఈయన ప్రతిభ, కథలోనే ఈయన మెలకువ. బాషలోనే ఈయన పెళుసుదనము గోచరిస్తవి. ఈయన కవిత మొత్తంమీద ప్రతిభావంతం గానూ శాస్త్రీయంగానూ వుండినా కొన్నిచోట్ల మార్దవం లోపించి ఘాటు గాను గడబిడగానూ కూడా వుంటుంది. అందుకే కాబోలు శ్రీశ్రీ అన్నాడు. 'విశ్వసత్యనారాయణ అగ్గిమీది గుగ్గిలం'అని—ఉక్కిరి బిక్కిరై పోతుంది. నాబోటి చదివేవారికి. చిక్కని గ్రాంధికంలో సమాసభూయిష్టంగా వ్రాస్తూనూవుంటాడు,

ఉన్నట్లుండి అచ్చమైన తెలుగుపలుకుబడికి నుడికారానికి వాలిపోనూ పోతాడు. అయినా అది ఏరోప్లేనులో పోతున్నప్పుడు గాలి కుదుపు తిన్నంత చమత్కారంగా ఉంటుంది.

వీరి శైలి చాలాచోట్ల మనోజ్ఞమైనదే. శైలీలక్షణాలనుకొనే economy, early association, suggestivity, emphatic articulation— ఇవన్నీ వీరి రచనలో చూడవచ్చు. ఛందస్సు వీరి చేతిక్రింద బానిస. ప్రాసయతి వేయడంలో ఈయనకున్న నేర్పు మరెవ్వరికీ లేదని తోస్తుంది నాకు. యతిప్రాసలకోసం ఈయన మాటలు తయారు చేస్తాడని ఎవరో విమర్శించారు. అది తగదు. ఒక వేళ చేసివుంటే ఆ మాటను సృష్టించడానికే అలా చేసివుంటాడు. గానీ ఛందస్సు కోసం అనుకోడానికి మాత్రం వీలులేదు. ఆయ నంతటిసుకవి.

ఈ వ్యాకరణ ప్రయోగాలు చిత్తగించండి. నిస్వనించు, ప్రభావించు, నైర్మల్యించు, విమలీకరించు, శీతలింపించు, శైతల్యం, బాహిరిల్లి, బాహిరవెట్టు, ఇక వారు వాడే కృత్తద్ధితాలకు కొదవేలేదు. అది వారికే అబ్బిన ఒక వైశిష్ట్యం. అందుకే ఒకరు వారి రామాయణాన్ని 'వైశ్వనాథసత్యనారాయణీయం' అని కాబోలన్నారు చమత్కారంగా. ఇక్కడే నాకూ ఒక అభ్యంతరముంది. వడబోసిన తెనుగుదనం నుడికారంలోనూ, భావంలోనూ వీరి కుండినా, వ్రాయ సమర్థులైనా ఎందుకో సంస్కృతభాషామర్యాదను పలుకుబడిని అధికంగా సేవిస్తారు వీరు. దీనివల్ల ఆతీరువ్రాత ఒక్కొక్కసారి తెలుగుదనానికి దూరమై కృతకంగా కనపడడమేకాక తెలుగుభాషాసౌష్ఠవానికి, పుష్టికి, తగినంత ప్రకటన లేకపోతున్నది. సమర్థులచేతిలోనూ భాషకిలా అన్యాయం జరగడం భావ్యంకాదు.

ఇక వ్యావహారికభాషలో కాస్తో కూస్తో, వచ్చినకాడికి - ఎంతోవింత - ఇంతాతోచియు, అక్లైంది, మాద్రిగా ఇత్యాది తెల్గు; డైవుబాంబింగు, షెల్టర్ ఆంటియార్క్రాఫ్టుగన్ను, కాస్మాపాలిటన్, బిగట్సు, బ్రాథెల్సు, ఇంజనీరింగ్ వర్కుషాపు- ఇత్యాది ఇంగ్లీషుపదాలు నిర్భయంగా వాడుతాడు సందర్భాన్ని బట్టి! వ్యాకరణం విషయంలోను ఎంత జాగ్రత్తచూపుతాడో అంత స్వేచ్ఛా గ్రహిస్తాడు. 'తమరు అందెవేసినచేతులైరకట! అంటారు నాచన సోమనాథుని వలె.'

ఈయన రచనలో శబ్దచిత్రాలు అడుగడుగునా కనిపిస్తాయి. స్వామి తననాడిస్తున్నా డనడానికి 'ఎన్ని గిరాట్లుపెట్టైదవో' అంటాడు. ఆ మాటలో

అంత భావచిత్రణమున్నది, గ్రీష్మంలో నలికెలపాముని 'నలిగిపోయిన పురికొసవలె' నున్నదంటాడు - అచ్చమంతే అది. 'వర్షంలో' ఎగదువ్వుకొన్నవి తాటితోపుతలలు' అంటాడు. రూఢిగావున్నదా మాట ! 'అంతః ప్రగర్జన్మహాంభోధరమ్ములు అశనిపాతోగ్రఘోరాంబుదములు' - ఈ సీసంనడకే పర్జన్యలక్ష్మి కదలివస్తున్నట్లున్నది. అలాగే శరత్తులో 'అనిలాహతి తబకలాడె నొడ్డులు మోచి క్రొత్త నీరును పెట్టుకొన్న చెఱువు' - అనిలాహతి తబకలాడె ననడంలో మనం చెరువు ప్రక్కనే నిలబడి ఆచిరుకెరటాల సవ్వడుల వింటున్నట్లేవుంటుంది. కుమారస్వామి ఉదయించగా పార్వతి 'పసుపుతోటలలోనంకురంబుల విధాన తనుకు నామేను పులకరించినది తండ్రి'- అంటుంది. చాలా నప్పివుంది ఆ పోల్కి. అత్త దీవించిపంపగా కోడలు దేవసేన 'సిగ్గుల్ పండిన చేనుగా కోడలు, నొండు విరుగు నదివిధాన నొగి తేరి చనెన్' అంటాడు. ఒండుపట్టిన నది ఎంత కలకగా వుంటుందో విరగగానే ఎంత తేటపడుతుందో చూచినవారికి తెలుస్తుంది. కిన్నెర దుఃఖంతో కదలలేక కదలుతూ వుంటుంది. 'పలుపోసి లాగగా బడ్డట్టి లేగలా' సాగింది-అంటాడు. ఆ బడుధాతువు అక్కడ చాలా సొగసుగా ప్రయోగించబడ్డది. ఇలాగే వీరి కొండవీటి పొగమబ్బులమాటున అనంతమైన శబ్దచిత్రాలున్నవి. ఇట్లే 'వేసవి చితచితలై, ఎండ కొఅకొఅలాడ దొడగె, కారాలు మిరియాలు నూరిపోసె' ఇత్యాది తెల్గు పలుకుబడులతో సందర్భాన్ని కన్నుల కట్టిస్తాడు.

ఇక ఛందస్సులో వీరికి భావాన్నిబట్టి ఛందస్సుగాని - ఛందస్సునుబట్టి భావంకాదు. భావం అయిపోతే ఛందస్సూ ఆగిపోతుంది.

> అచ్చమౌ మహదానంద మనుభవింప
> జాల దీ శరీరము బాధ సమ్మిళితము
> కావలయు బోలెనున్నది......

అంతే - ఆపైన వుండదు. అలాగే—

"ఉగ్రరాహు చంద్రార్కబింబ గ్రసనమువోలె నున్నది నా స్థితి..."

'విగతతృష్ణుని నన్నంత వెక్కిరించు నీ మహాతృష్ణ..' ఇలా చటుక్కున ఆపివేయడంలో భావతీవ్రత ద్యోతకమవుతుంది. ఆధునికాంధ్రకవులు ముఖ్యంగా ఛందస్సులో ఇలాటి experiments ఎన్నో చేశారు. ప్రాస యతి చూడండి ఎంత సొగసుగా వేస్తాడో ఈ కవి:

> 'కోపచండము కొరడాపెట్టి మొగమున
> కడ్డమ్ముగా కొట్టినట్లు మెరసె'

కోప—డాపెట్టిలో 'డాపె' కి. అక్కడ విరుద్ధమని ఎవరికి పుడుతుంది? అందునా సొగసు చూడండి. వానాకాలంలో ఆ మెరుపులు ఉన్నట్లుండి ఛళ్ళున కంటికి కొడతాయి. క్షణంసేపు దిమ్మదిరిగి కళ్ళు చీకట్లుకమ్ముతాయి. దాన్ని సూచిస్తున్నాడు కవి. బండివాడు జాటీని దాచిదాచి ఛళ్ళున గుఱ్ఱంమీద కొట్టినట్లు కొరడాను డాపెట్టి దాచిపెట్టి మొగంమీద కొట్టినట్లైందట. ఆ ప్రాస యతిలో ఆ కొరడాను డాపెట్టికొట్టాడు కవి. ఇలా ప్రాసయతుల మాధుర్యాన్ని చాలచోట్ల చూపవచ్చు వీరి కవితలో.

ఇంత జాగ్రత్త చూపిన ఈ కవి ఎందుకో 'కోకిలమ్మ పెళ్ళి'లో తేలి పోయినాడు. ఉద్దేశపూర్వకమే అనుకొంటాను. నాకు తెలియదు. యతీలేదు, గతీలేదు అందులో—

ఆఖరుకి—ఇంతటి మహాకవి కవితలో ఔచిత్యాలతోబాటు అనౌచిత్యాలు కూడా ఏమైన వున్నవా అని అన్వేషిస్తున్నాను—ఏమైనా ఉండి అవి నిజంగా తప్పులైతే చూపిన నా గొప్ప—కాకుంటే వ్రాసిన కవి గొప్ప— అంతే అనుకోండి.

ఈ రచనలో విశేషణములు, సంబోధనలుకూడా చాలా సాభిప్రాయంగా వాడతాడు కవి. 'ఓసి ప్రియా! పదమ్మ లిట నుంచుము'—అంటూ...చివరికి... ఈ రహో విహారసమకేళికిన్ ఘటితమౌఝుమి విఘ్నము మందగామినీ' అంటాడు—ఔచిత్యముంది.

అట్లే మరొకచోట "మదగజయాన పండుకొనె మాధవ రాధిక వేప మానయై" అని deliberate గా వ్రాస్తాడు. ఇందులోనూ ఒక ఔచిత్యం contrast వల్ల తీసుకువస్తాడు. అది ఊహించి యానందింపవలసినదే. 'గుండెల్ దీసిన బంటు' అంటాడు. గుండె పదం అక్కడ బాగుంది. అదే 'పద్యాలల్లి నా గుండెతో' అండాడు మరొకచోట. మనస్సు, హృదయము అంటే బాగుగాని 'గుండె' అనడం అక్కడ నాకెందుకో బండగా ఉంది. అట్లా ఒకవేళ నన్నయ్య వాడివుండినా మనకు మొండిగానే ఉంటుంది. (ఆధునిక కవులు చాలామంది 'గుండెల్లో నిండిన ప్రేమామృతాన్ని' తరచు వర్ణిస్తున్నారు. ఆ మాటలు విన్నప్పుడెల్లా నాకు పెళ్ళిళ్ళలో గాడిపొయ్యిమీది గంగాళాలు - కాగుతున్న పులుసు జ్ఞాపకమొస్తవి. క్షమించండి!) కవితలోని లాలిత్యమక్కడ దెబ్బ తింటుంది. 'చిలుకతల్లీ సొగసువాకలు....కలకలై తేనెలా చినుకులు గలపరించాయి' అంటాము. అక్కడ గలపరించాయి అనడంకన్నా జలపరించాయి

అంటే సొగసేమో—ఇట్లే మరొకటి—వీరికి 'బల్లి అదుకుకొన్నట్లు' అనడం నచ్చిన ఉపమానాల్లో ఒకటి. వరలక్ష్మీ త్రిశతిలో భార్య పోయిన తర్వాత పిల్లలసంగతి తడవుతూ వారు 'నాదు ఎడదలో బల్లుల ట్లదుకుకొన్నారు' అని ఎంతో ఔచిత్యంతో వ్రాస్తారు. గోడ నిర్జీవమైనది. దాన్ని ఆధారం చేసుకొని బల్లులు ప్రాకులాడుతవి. అలాగే ఈయనా భార్యావియోగంతో నిర్జీవుడు. రచన అక్కడ చాలా బాగుంది.

అదే- శృంగారవీథిలో 'భుజమ్మును వంచి మెల్లపల్లొత్తవ నిన్ను నా ఎడద నొత్తిన బల్లి విధాన నీతలన్ గ్రుత్తువుగాని ఔమ్మువయి గూర్చవ నీవు ననున్ గవుంగిటన్' అంటాడు — కుమారాభ్యుదయంలో వల్లి 'సెజ్జపయి నొత్తిలి మంచము పట్టె బల్లి నానూనిశయించ' నంటాడు. ఇవి మొదట వాడినంత ఉచితంగా లేవు. అయినా క్షుద్రమైన బల్లితో ఉపమాన మేమిటనిపిస్తుంది నాకు—ఒప్పో తప్పో నాకు తెలియదు! శశిదూతంలో 'పెను నెడబాటుటగ్గికిః దపించిననాతుల పాలిటన్ సుదర్శన మవు' అనడంలో ఒడ్డారవు నాకొడుకులు పద్యంలోని అశ్లీలతా దోషానికి సన్నిహితమైన దోషం కనిపిస్తుంది. ఇట్లాటివి సత్కవి పరిహరించడం మంచిది.

ఇలాగే హేమంతాన్ని వర్ణిస్తూ చక్కని కవితాచిత్రణ చేస్తూ అమాంతంగా దానినంతా భగ్నం చేసేలాగున-పాలలో నిమ్మరసం పిండినట్లు చెరిచి వేసే భావాన్ని మధ్య ప్రవేశపెట్టినాడు. ఆ పద్యం చదివినప్పుడెల్లా భావనలో నున్న అనౌచిత్యపు ఎగుడు దిగుడులకు నా మనస్సు క్షోభిస్తుంది.

"ఆగామి శిశిరభయంబుచే జమిలి దు
ప్పట కప్పుకొనెనేమొ ప్రకృతికాంత
వేరెవిసంబు విత్తై కుబుసం బూడ్చి
నదియేమొ మిన్నను నల్లత్రాచు — అని
గురుదార గమనాఘకుటిలతలోబుచ్చి
నుసిరాలునేమొ చందురుని బిళ్ళ"

అన్నాడు. ఎంత అసందర్భంగా వుందో చూడండి. ఇవి అనంతమైన శిల్పాన్ని పాటించే ఆ మహాకవి కెందుకు తోచవో—కాక—నాకు తెలియని వేరే వింతభావ మేమైనా అందులో వున్నదో!— నేను చెప్పలేను. మరొక్కటి మాత్రం ఉదాహరించి నా ఉపన్యాసం ముగిస్తాను. ఝాన్సీరాణిలో—'పంజర నిబద్ధము వ్యాఘ్రము' అంటాడు కవి. 'బోనునపడ్డ మత్తహరి పోలిక' అంటాడు

కంకంటి పాపరాజు. ఈయనకూడా తెనుగుదనం కాపాడడానికి 'బోను' శబ్దం వాడరాదా అనిపిస్తుంది నాకు. జంతువులకీ 'పంజరాన్ని' కట్టడం సంస్కృత మర్యాదయితే కావచ్చు కాని—తెనుగు మర్యాదమాత్రం కాదనుకొంటాను.

చివరిమాట: ఇంకా నాకు తెలియని వీరి ఖండకృతు లెన్ని వున్నవో. నాకు తెలిసిన వానినిగూర్చి నాకు తెలిసినంతమాత్రంగా ఈ విమర్శ వ్రాశాను. వీ రిటీవల సంస్కృతంలో ఒక శతకం వ్రాస్తున్నట్లు విన్నాను. అది నాకు లభ్యం కాలేదు. నిన్న నే మిత్రులవల్ల విన్నాను, వీరి వేణుగోపాల శతకం ఇటీవల 'నవభారతి' పత్రికలో పడుతున్నట్లు. నే నా పత్రికలు చూడలేదు. కాబట్టి ఆ లోట్లు తర్వాత ఎప్పుడైనా తీరికగా తీర్చుకోడానికి యత్నిస్తాను. ప్రస్తుతాని కింతే. కాని తుదికి వీరి యీ లఘుకృతుల నంకితము గొన్న పెద్దలనుకూడ ఒకసారి స్మరింపవలసి వున్నది. కామించి పతిత్వం వహించినవారు శ్రీ మదాచార్య రఘునాథ చక్రవర్తిగారు. శృంగారవీథికి వీరు పతులయ్యారు. ఇక రెండవవారు తమకు తెలియకుండానే మామగారు వెదకికొంటూ వచ్చి కావ్యకన్నె నర్పించితే అంగీకరించి సాత్త్వికంగా 'ఆంధ్రప్రశస్తి'ని పలుకొన్నవారు శ్రీ మల్లంపల్లివారు. మూడవవారు - తనకొఱకు నా కుమారుడు, గాంగేయునివలె ఈ కవిరాజు బిడ్డను 'ఝాన్సీరాణి' నర్థించి పరిగ్రహింపచేయగా పైనుండి చల్లగా పుచ్చుకొన్నవారు కీ. శే. ధర్మవరపు వెంకటసుబ్బయ్యగారు. నాలుగవవారు ఋతుకన్నె వలచి పైబడగా చటుక్కున దాని ముచ్చట దీరిచినారు రసికవర్యులు శ్రీ కట్టమంచివారు. ఇలాగే శ్రీ గోపాలరెడ్డి ప్రభృతుల నెందరినో ప్రతిభావంతులైన అల్లుళ్ళను కూడగట్టుకొన్న ఉదారులు కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కవితా సంసారం కలకాలం నిత్యకళ్యాణంగా వర్ధిల్లాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను—

వారి మాటల్లోనే

"పలు పలుకులేల కవితా
లలితాంగికి గొప్పులో నలంకరణమ్ముల్
కలిపించిరి లేజాజుల
దెలిమల్లెల తావిపెల్లు దిక్కులు నిండన్."



# తెలుగు కన్నడ భాషలకు ఏకలిపి ఆవశ్యకత

— శ్రీ విద్వాన్ కె. సుబ్బరామప్ప, ఎం.ఏ., బి. ఇడి.

భాషలకు ఏకలిపిని రూపొందించేవిషయాన్నిగూర్చి మొదట డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారు సూచనచేశారు. వారు అన్ని భాషలకూ నాగరలిపి వుంటే బాగుంటుందన్నారు. తర్వాత ఆచార్య వినోబాభావేగారు దక్షిణ హిందూదేశంలో పర్యటన చేసే సందర్భంలో తెలుగు-కన్నడ భాషల పోలికలను చూచి రెంటికీ ఒకే లిపి చేసుకుంటే బాగుంటుందన్నారు. డాక్టర్. బి. గోపాలరెడ్డిగారు, ఆంధ్ర ముఖ్యమంత్రిగా వుండినప్పుడు బెంగుళూరిలో ఒక సభలో ఉపన్యసిస్తూ తెలుగు కన్నడభాషలకు ఏకలిపిని సూచనచేశారు. అప్పటి మైసూరు ముఖ్యమంత్రి శ్రీ కె. హనుమంతయ్యగారు కూడా దీన్ని స్వాగతించారు. ఇటీవల డాక్టర్ గోపాలరెడ్డిగారిని బెంగుళూరిలోని కన్నడ సాహిత్య అకాడమీవారు సత్కరించి నప్పుడు ఆ సభలో ఉపన్యసిస్తూ తెలుగు కన్నడ భాషలకు ఏకలిపిని రూపొం దించడం అఖిల భారతభాషలకు ఏకలిపిని రూపొందించడానికి నాంది కాగలదని చెప్పారు.

ఈ ఏకలిపిని రూపొందించే విషయంలో నేనూ ఆలోచిస్తూ వచ్చాను. మైసూరు విశ్వవిద్యాలయంలో నేను కన్నడసాహిత్య బి. ఏ., ఆనర్సు విద్యార్థులకు తెలుగును మైనర్ సబ్జక్టుగా బోధిస్తున్నాను. వారికి అక్షరాలతో మొదలుపెట్టి కన్నడభాష మూలంగా తెలుగుభాషాసాహిత్యాలను పరిచయం చేస్తున్నాను. అప్పట్లో యీ రెండు భాషలకు లిపులకూ సాహిత్యాలకూ వుండే సంబంధాలను వివరిస్తూ వచ్చేటప్పుడు ఈ రెండింటికీ ఒకేలిపి యెందుకు సాధ్యంకాకూడదని అక్కడక్కడా సభల్లో వుపన్యసిస్తూ వచ్చాను. చాలవఱకు వివరించాను. ఇక్కడి విద్యార్థులకు చెప్పాను. చూపించినాను రూపొందించే విధానాన్ని.

1958 జనవరి నెలలో బళ్లారిలో జరిగిన అఖిల కర్ణాటక సాహిత్య సమ్మేళ నంలో నేను కన్నడ తెలుగు సాహిత్యాల పరస్పర బాంధవ్యాన్ని వివరించి రెండిం టికీ ఏకలిపిని సూచించాను. సుప్రసిద్ధ కన్నడ కవియైన శ్రీ ద. రా. బేంద్రె వంటి వారు దీనిని పుష్టీకరించినారు. సాహిత్య సమ్మేళనంవారు ఏకగ్రీవంగా రెండు భాషలకూ ఏకలిపిని రూపొందించే విషయాన్ని తీర్మానరూపంగా ఆమోదించారు. పిమ్మట నేను 1958 ఫిబ్రవరిలో అనంతపురంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర పండిత

పరిషత్తులో యిదే విషయమై ఉపన్యసించిన పిమ్మట పండితపరిషత్తువారు కూడ కన్నడ సాహిత్య సమ్మేళనంవారి తీర్మానాన్ని స్వాగతిస్తూ తాము దీనికి సహకారం యిస్తామని ఒక తీర్మానాన్ని ఆమోదించినారు—'ఆంధ్రప్రభ' 'గోల్కొండపత్రిక'లు సంపాదకీయ వ్యాసాలు వ్రాసి ఏకలిపిని రూపొందించడాన్ని బలపఱచినాయి.

ఏకలిపిని రూపొందించేది ఎలాగా అనే విషయాన్ని యిక్కడ మనవి చేస్తాను. అంతకుముందు—తెలుగువారికీ కన్నడిగులకూ అనాదిగా వుంటూవచ్చిన సంబంధాలను వివరిస్తాను.

కన్నడభాషలో 9 వ శతాబ్దాన మొదట గ్రంథం వ్రాసిన నృపతుంగుడు తన గ్రంథం 'కవిరాజ మార్గం' లో కన్నడదేశ విస్తారాన్ని ప్రస్తావించి 'కావేరి ఇంద గోదావరి వరం' (కావేరి నుండి గోదావరి వరకూ) అన్నాడు. దీన్నిబట్టి చూస్తే 9 వ శతాబ్దంనాటికి గోదావరితీరందాకా కన్నడ భాషకూడా వాడుకలోనుండినట్లు స్పష్టమవుతుంది. 9 వ శతాబ్దంనాటికే కన్నడిగులు కావ్యాలను వ్రాసినట్టు వారికి నిర్దుష్టమైన వాఙ్మయం యేర్పడినట్టు ఆధారాలున్నాయి. తెలుగువారికి తొలికావ్యం నన్నయ భారతంతో ఆరంభమైంది (1030 A. D.). అంతకుముందు తెలుగువారు 'కాసట బీసటే చదివి గాథలు త్రవ్వుతూ' వుండినట్లు తోస్తుంది. చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుడే తెలుగుభారతానికి పోషకుడైనాడు. చాళుక్యులు కన్నడిగుల సంబంధీకులని డా. నేలటూరి వేంకటరమణయ్యగారన్నారు (చూ. "భారతి" డిశంబరు 1948). తెలుగువారి లిపిని కన్నడిగుల లిపిని చూస్తే రెంటికీ విపరీతమైన పోలిక లున్నాయి. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 250 ఏండ్లక్రితం రెండు లిపులూ ఒకటిగానే వుండేవని మొన్న లిపిసంస్కరణ సంఘంలో అధ్యక్షపీఠం నుండే మాట్లాడుతూ అన్నారు.

తెలుగువారు కన్నడిగుల సాహిత్యంనుండినీ్న, కన్నడిగులు తెలుగువారి సాహిత్యంనుండినీ్న పరస్పరం స్ఫూర్తిని పొందినారు. నన్నయ రచించిన తెలుగు భారతంలో పంపభారతం పోకడ లున్నాయి. ఇందుకు మనకు దొరికే నిదర్శనం యేమిటంటే కన్నడకవి యైన నారాయణభట్టు సహాయాన్ని మన నన్నయ పొందడమే. భారతరచనలో యీతని సహాయం యింతింతకాదు. మాహా గొప్పది, 'పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణుని' వంటిది. దీనినిబట్టి చూస్తే ఆవరకే నూరేండ్లుగా ప్రసిద్ధికి వచ్చిన పశ్చిమచాళుక్యుల పోషణ క్రింద తయారైన కన్నడ పంపభారతాన్ని బాగా చదివి మన నన్నయకు చెప్పి వుంటాడు. ఇంతకూ పంపకవి వేంగిపట్టునుండి కన్నడదేశానికిపోయిన ఆంధ్రుడే.



పాల్కురికి సోమనాథుని బసవపురాణాన్ని 14 వ శతాబ్దంలో కన్నడభాషలోనికి భీమకవి పరివర్తనం చేశాడు షట్పదీవృత్తంలో. ప్రాసభూషణ పెమ్మిశెట్టి (16 వ శతాబ్దం) పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలోని గురుభక్తి యాండారు చరిత్రను షట్పదులలో కన్నడీకరించినాడు. తెలుగున పిడుపర్తి బసవన కన్నడ ప్రసిద్ధకవియైన చామరసుని ' ప్రభులింగలీల ' ను (అల్లమప్రభు కథ) వ్రాసినాడు. విజయనగరాధీశ్వరుడైన బుక్కప్రభుని ఆస్థానంలో తెలుగుకవి నాచన సోము డుండినాడు. కన్నడసమ్రాట్ ప్రౌఢదేవరాయని ఆస్థానంలో మన కవిసార్వభౌము డైన శ్రీనాథునికి ముత్యాలమంటపంలో కనకాభిషేకం జరిగింది.

కృష్ణదేవరాయని కాలంలో తెలుగు-కన్నడముల పొత్తు బాగా కలిసిమెలసి పోయింది. కన్నడంలో కుమారవ్యాసుడు వ్రాయక విడిచిన కడపటి ఎనిమిదిపర్వాల భారతాన్ని తిమ్మణ్ణకవి వ్రాసి కృష్ణదేవరాయనికి అంకితం చేశాడు. కృష్ణదేవ రాయని ఆజ్ఞమేరకు యీతడు తిక్కన సోమయాజి వ్రాసిన అదే పర్వాలను చూచి వ్రాసినాడు. మన ముక్కు తిమ్మన వ్రాసిన పారిజాతాపహరణ కావ్యానికి చక్కని స్ఫూర్తి 13 వ శతాబ్దంలో రుద్రభట్టు అనే కన్నడకవి వ్రాసిన 'జగన్నాథవిజయం'లో లభించింది. ఈ సంగతి మన తిమ్మన యెక్కడా తన కావ్యంలో చెప్పుకోలేదు కాని పరిశోధనలవలన యిప్పుడు తేలింది. రుద్రభట్టు 209 పద్యాలలో వ్రాసిన కృష్ణ పారిజాతకథలు ముక్కు తిమ్మన పెంచి 500 పద్యాలకు పైగా గల ప్రబంధంగా వ్రాసినాడు. మన అల్లసాని పెద్దన్న ఆశువుగా చెప్పిన 'నిరుపహతి స్థలంబు' అనే పద్యానికి సరియైన నకలు పెద్దనకంటే 300 ఏండ్లక్రితం కన్నడకవి మల్లిఖార్జునుడు కూర్చిన 'సూక్తి సుధార్ణవం' గ్రంథంలో అదే పదాలతో ఆరంభమవుతుంది. 'నిరుపహతి స్థలంగె' అని.

ఆంధ్ర వాఙ్మయంలోని మొదటి తెలుగు వచన గ్రంథం మైసూరులోనే ఉదయించింది. అదే వచన భారతం. 1720 లో మైసూరును ఏలిన చిక్కదేవ రాయని దళవాయి కళలె వీరరాజు దానిని వ్రాసింది. మైసూరు రాజుల్లో ఒకడైన కంఠీరవ నరసరాజు తెలుగులో యక్షగానాలు వ్రాసినాడని వాని వ్రాత ప్రతులు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో వున్నాయని నిడదవోలు వేంకటరావుగారు వ్రాశారు. ముమ్మడి కృష్ణదేవరాయల ఆస్థానకవిగా వుండిన కుందలకుర్కి చంద్ర కవి అనే తెలుగుకవి 'కృష్ణభూపాలీయం' అనే పద్యకావ్యం వ్రాసినాడు. శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు దీనికి పీఠిక వ్రాసినారు. అచ్చయింది. నన్నయ భట్టు వ్రాసిన 'ఆంధ్ర శబ్ద చింతామణి'కి తెలుగు భాషాంతరీకరణమిది. మన

వేమన, కన్నడిగుల సర్వజ్ఞ ఈ యిరువురూ సమకాలీనులని అంటారు. వీరిరువురికి సంవాదం జరిగినట్లు అచ్చయిన ఒక పుస్తకం మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో వుంది. ఈ పై ఉదాహరణాలనుండీ తెలుగు కన్నడిగులకు మిక్కిలి సన్నిహితత్వం వుంటూవచ్చిందని తెలుస్తుంది.

ఇటీవల ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు హైదరాబాద్‌లో 12 వ, రాష్ట్రేతర కన్నడిగుల మహాసభను ప్రారంభిస్తూ తెలుగు కన్నడ భాషలకు ఏకలిపిని స్వాగతిస్తూ ఉపన్యసించారు. ఆ సమ్మేళనంవారు యీ రెండు భాషలకూ ఏకలిపిని రూపొందించవలెనని కోరుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించినారు. అదే మహాసభలో ఉపన్యసించిన కేంద్ర మంత్రి బి. ఎన్. దాతార్‌గారు కూడా ఏకలిపి విధానాన్ని ఒప్పుకున్నారు. మైసూరు ముఖ్య మంత్రి శ్రీ బి. డి. జత్తిగారున్ను, ఆర్థిక మంత్రి శ్రీ టి. మరియప్పగారున్ను ఏకలిపి వుండడం మంచిదని ఒప్పుకుని సభలలో చెప్పారు. *ఆంధ్ర ప్రభుత్వంవారు ఈ విధానాన్ని ఒప్పుకుని తెలుగు లిపి సంస్కరణ సంఘం ఈ రెండు భాషలకూ ఏకలిపిని రూపొందించే విషయాన్ని పరిశీలించవచ్చుని ఆదేశించింది.*

ఇప్పుడు ఈ రెండు భాషల లిపులకు వుండే పోలికలను, సంస్కరణ విధానాన్ని సూచిస్తాను :

*అచ్చులు కన్నడం :* ಅ ಆ ಇ ಈ ಉ ಊ ಋ ೠ ಎ ಏ ಐ ಒ ಓ ಔ ಅಂ ಅಃ.

*తెలుగు :* అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః.

*వ్యత్యాసం :* ಉ (ఉ) ಋ (ఋ)

*హల్లులు కన్నడం :*

ಕ ಖ ಗ ಘ ಙ
ಚ ಛ ಜ ಝ ಞ
ಟ ಠ ಡ ಢ ಣ
ತ ಥ ದ ಧ ನ
ಪ ಫ ಬ ಭ ಮ
ಯ ರ ಲ ಳ ವ ಶ ಷ ಸ ಹ ಕ್ಷ

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | క | ఖ | గ | ఘ | ఙ | | | | | | |
| | చ | ఛ | జ | ఝ | ఞ | | | | | | |
| | ట | ఠ | డ | ఢ | ణ | | | | | | |
| | త | థ | ద | ధ | న | | | | | | |
| | ప | ఫ | బ | భ | మ | | | | | | |
| | య | ర | ఱ | | ళ | వ | శ | ష | స | హ | క్ష |

వ్యత్యాసం (కొద్దిగా): ಕ (క) ಚ (చ) ತ (త) ಹ (హ)
సంస్కరించుకుంటే

ఏకలిపి ఈరీతిగా వుంటుంది.*

అచ్చులు: అ అ౯ ఇ ఇ౯ ఉ (ఉ) ఉ౯ ృ ('ఋ'కు బదులు)
ృ౯ ఎ ఎ౯ ఐ ఒ ఒ౯ ఔ అం అః.

'౯' గుర్తు ఉపయోగించుకుని ఆరు అక్షరాలను తగ్గించుకోవచ్చు. ఈ దీర్ఘపు చిహ్నాన్ని సర్వత్రా ఉపయోగించుకోవచ్చు. హల్లులకు కూడా, 'ృ' పదాదిలో వుండే 'ఋ' ఉచ్చారణగా తీసుకోవాలి. ఉదా: ృణము, ృతువు, ఇలాంటి పదాలు రెండు భాషలవారికీ చాలా తక్కువ.

తెలుగువారి 'ఉ' కంటే కన్నడంవారి 'ಉ' చేయి ఎత్తకుండా సులభంగా వ్రాయవచ్చు అని నా సూచన. మిగతా అన్ని అక్షరాలూ సమానమే.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హల్లులు: | క | క' | గ | గ' | ఙ | | | | | |
| | చ | చ' | జ | జ' | ఞ | | | | | |
| | ట | ట' | డ | డ' | ణ | | | | | |
| | త | త' | ద | ద' | న | | | | | |
| | ప | ప' | బ | బ' | మ | | | | | |
| | య ర (ఱ) | ల | ళ | వ | శ | ష | స | ಹ | క్ష | |

వివరణ: కన్నడ ಪ ಷ ಸ ಹ

ఇవి సులభంగా చేయి యెత్తకుండా వ్రాయవచ్చు. సౌలభ్య దృష్ట్యా ఇది మేలని నా ఊహ. తెలుగువారు ప ష స వీనిని వ్రాసేటప్పుడు చేయి ఎత్తి తల

* ఇది సూచనమాత్రంగా తీసుకోవాలి. సౌలభ్య దృష్ట్యా అనుకూలమైన మార్పులు చేసుకోవచ్చు.

కట్టు యివ్వాలి లేదా వ, న యివి వ్రాసి నెత్తిపైన చుక్కగాని గీటుగాని గీయాలి. చాలామంది యిలా చేస్తున్నారు వ్రాతల్లో.

ఇక వత్తక్షరాలను సంయుక్తాక్షరాలను మనం ఉచ్చారణ చేస్తూ వున్నట్టే వ్రాస్తే సరిపోతుంది, అచ్చు తప్పులు చాలా తప్పుతవి. వత్తులు సాధారణంగా అచ్చులో ముఖ్యంగా వార్తా పత్రికల్లో అంటడంలేనిది మనం చూస్తూన్నాము. ఇవి చూడండి.

ఉదా: అశ్‌వ (అశ్వ) అల్‌ప (అల్ప) అక్‌క (అక్క) అయ్‌య (అయ్య) మొ॥ ఈవిధానం టైపు యంత్రాలకు, ముద్రణ యంత్రాలకు అనుకూలం.

*గుణితాల గుర్తులు :*

| | | | |
|---|---|---|---|
| ా or ✓ | అ | | ఎ |
| ✓ా | ఆ | ౕా | ఏ |
| ి | ఇ | ై | ఐ |
| ీ | ఈ | | అం |
| ు | ఉ | | అః |
| ూ | ఊ | | |
| ృ | ఋ | | |
| ౄ | ౠ | | |

—ఇవన్నీ అక్షరాల కుడిప్రక్కన వస్తాయి.

పైని వివరించినవన్నీ కేవలం సూచనలు. వీనిలో అనుకూలమైన మార్పులను సౌలభ్యదృష్ట్యా అనేకం చేసుకోవచ్చు. వీనిపై సలహాలు లిపి సంస్కరణ సంఘానికి పంపించవచ్చు.



నాటిక :

# ఏకాంకిక

శ్రీ చంద్రమౌళి

— పాత్రలు —

కళాధర్ : కళాశాల విద్యార్థి; కళారాధకుడు
శాస్త్రి, మురళి, రంగడు : కళాధర్ స్నేహితులు
రామారావు : కళాధర్ తండ్రిగారు; లక్షాధికారి
కనకయ్య : రామారావుగారి ఇంటి నౌకరు
డాక్టర్ :
ఇంటి ఓనరు :

(కాలం : వర్తమానం)

[తెరలేస్తుంది - మధ్యరకం ఇంటిలోని ఒక గది. ఒక మూలగా టేబుల్. దానిమీద కొన్ని నాటక పుస్తకాలు, "కళారాధన నాట్య మండలి" అని వ్రాయబడిన, దుమ్ముతో కూడుకున్న బోర్డు ఉంటవి. గది మధ్యలో వేరొక టేబులు, ప్రక్కనే ఒక వాలు కుర్చీ. ఒక బెంచి, రెండు కుర్చీలు అమర్చబడి ఉంటవి. గోడ ప్రక్కగా కొన్ని ప్రక్క చుట్టలు, రెండు మూడు ట్రంకులు. గోడలకు క్యాలెండర్లు, నటుల చిత్రపటాలు, ఒక మూలగా మంచినీటి కూజా, గ్లాసు. వీలైతే హార్మోనియం, తబ్లా వంటి ఇన్స్ట్రుమెంట్సు చూపవచ్చును.

శాస్త్రి ఏదో ఒక నాటక పుస్తకం చూస్తూ ఉంటాడు. మురళి కుర్చీలో, రంగడు టేబులు మీద కూర్చొని ఉంటారు. మురళి కాళ్ళు టేబులుమీద ఉంచి దీర్ఘంగా ఆలోచనలో పడి అప్పుడప్పుడూ, రంగడి వైపు చూస్తాడు. రంగడు చేతిగోళ్ళు కొరుక్కుంటూ మురళి వైపు అమాయకంగా చూస్తూ ఉంటాడు.]

(వాతావరణం నిశ్శబ్దంగా ఉంటుంది)

మురళి : (కుర్చీలోంచి లేచి కూజాలోని నీరు రెండు గ్లాసులు త్రాగి తిరిగి యధాప్రకారం కూర్చుని జేబులు తడుముకుంటాడు. పెదెం విఱిచి, మెల్లిగా రంగణ్ణి తట్టి 'బీడీ' కావాలని వేలితో సైగ చేస్తాడు.)

రంగడు : (తన జేబులు తడుముకుంటూ) నీ అదృష్టం! (అంటూ తాజమహల్ బీడి కట్ట కాగితాన్ని బైటికి తీసి, ఆ కాగితానికి రెండు బీడీలు అంటుకొని ఉన్నా ఒక్కటే ఉన్నట్లుగా నటించి) అర్రే! ఒక్కటే ఉంది భాయ్! Sorry! (అని ఒక బీడీని తన నోట్లో పెట్టుకొని, బీడీతో సహా కాగితాన్ని నలిపినట్లు నటించి ఒక మూలకు గుర్తుగా విసిరేస్తాడు.)

ముర : ఊఁ! (లేచిపోయి మూలనపడిన కాగితాన్ని తీసి, అందులోని బీడీని తీసి రంగడి వైపు విజయంగా చూస్తాడు.)

రంగ : (దెబ్బతిని) అరె! అందులో ఇంకొక బీడీ ఉందా! నేను చూడలేదు సుమీ!

నేను చూడలేదుసుమీ!....సరే పోనీలే....
ఏదీ కొంచెం ఫైర్ యిలా పడేయ్!
ముర: అదీ ఏ జేబులో ఉందో చూడు!
రంగ: లేదుబాయ్! ఉంటే నీ కెప్పుడన్నా కాదన్నానా చెప్పు?
ముర: అబ్బే! లేదులే! ఉన్నప్పుడు తప్పితే ఇక ఎప్పుడన్నా కాదంటావా మిత్రమా? వెధవది....బీడీ....
రంగ: Sorry brother! రాజీ! సరేనా!
ముర: (నవ్వుతూ) ఆఁ! అలా రా దారికి! (జేబులోనుంచి ఒక అగ్గిపుల్లను తీసి, లేచి మూలగా పడున్న ఖాళీపెట్టె తెచ్చి అగ్గిపుల్ల గీసి వెలిగించి ఇద్దరూ బీడీలు కాలుస్తారు)
రంగ: (నిట్టూరుస్తూ) బీడీలకి గూడా లాటరీ అయిపోయిందిగదరా నీ పాసుగాల!
ముర: మనంగాని ఇంకా ఇక్కడే ఉంటే బీడీలకు గాదు లాటరీ! ముందు మన ఒంటిమీద గుడ్డలకి వెయ్యాలి వేలం.... లేకుంటే నే చెపితే విన్నావుర?
రంగ: కళాధర్‌కు మనం చెప్పకుండా చెయ్యకుండా వెళ్ళిపోతే బాగుంటుందా! ప్చ్! నాకేమంత నచ్చలేదబ్బా!
ముర: అవున్రా, ఇప్పుడు మనం అలా వెళ్ళిపోతేమాత్రం వచ్చే నష్టమేమిటి? కావాలంటే తర్వాత వద్దాం!
శాస్త్రి: ఇప్పుడేం కష్టం వచ్చింది వెళ్ళిపోవటానికి?
ముర: అది మా ఇష్టం! మనస్సు బాగు లేదు-వెళ్ళిపోతున్నాం!
శాస్త్రి: అవును-బాగుండదు-నిజమే. 'కప్పలు' నాటకంలో ఊరికే ప్రవేశపెట్టారా ఆత్రేయగారు భద్రయ్యను, సాంబశివాన్ని!
ముర: అంటే మే మలాంటి వాళ్ళమనా నీ అభిప్రాయం!
శాస్త్రి: వేరే అభిప్రాయం దేనికి! ప్రత్యక్షంగా కనిపిస్తుంటేను!
ముర: ఏమిటి కనిపించేది నీ ముఖం!
శాస్త్రి: అదే! నీ చాష్టలు.
ముర: మాటలు తిన్నగా రానీయ్ మిష్టర్!
రంగ: అబ్బబ్బ! ఊరుకోండయ్యా స్వాములూ! మరీ నాటకంలోలాగా క్లైమాక్స్ వెళ్ళిపోతే ఎలా!....ఒకదారికి తీసుకరండి!
శాస్త్రి: కాకుంటే నువ్వే చెప్పు రంగం! కళాధర్‌గారు ఊరికెళ్ళి వారమయిందా! ఇంతవరకూ ఆయన జాడా, మనకు తెలియదు. ఆయన లేకుండా చూచి మీ రిలా వెళ్ళిపోవటం ఏమన్నా ధర్మంగా ఉందా!
రంగ: లేదు....
ముర: ఏమిటి 'లేదు'! నీ తలకాయ్!
రంగ: అదిగాదురా....
ముర: ఏదీగాదు. నువ్వు ఊరికి వస్తానంటావా లేకపోతే ఇక్కడే ఉండి అయ్యారుగాడి చేత, బీడిబంకోడి చేత దండకాలు చదివించుకుంటావా? తేల్చు.
శాస్త్రి: అవును. వాళ్ళకదరికీ డబ్బివ్వటం నువ్వేగదూ! పాపం!
ముర: ఇవ్వనీ ఇవ్వకపోనీ .... అసలంతెందుకు, రంగా! వస్తావా రావా?
రంగ: మరీ....మరి....అంతగట్టిగా అంటే.... సరే....పోయి వెంటనే వచ్చేద్దాం పా!
ముర: సరె....పక్కచుట్టలూ అవీ సర్దు. ఊఁ!
(ఇద్దరూ గుడ్డలు సర్దుకుంటుంటారు)
శాస్త్రి: ఇదుగో రంగం! ఆఖరిసారిగా బ్రతిమలాడుకుంటున్నా! మీ రిలా వెళ్ళి





పోతే కళాధర్‌గారికి మనం ద్రోహం చేసినవాళ్ళం అవుతాం చూడండి....తన చదువు పాడుచేసుకొని, తండ్రి గారి మాటలు గూడా లక్ష్యపెట్టక మన ఈ నాట్యమండలిని స్థాపించారు. వారు ఏ ఆశయ సాధనకు ఇంతగా కృషి చేస్తున్నారో, ఆర్టిస్టులమని చెప్పుకొనే మనం గూడా ఆ ఆశయం కొరకే పాటుబడతామనుకున్నారు. మనల్ని తీసుకొచ్చారు! ఇంతకాలం నుంచీ మనకు ఏ కొరతా లేకుండ చూశారు! ఏమీ తెలియని మన చేత ఎన్నో నాటకా లాడించారు. ఈనాడు మనమూ రంగుపూసుకొని నిలబడ గలిగే శక్తిని వారు ప్రసాదించారు. అటువంటి కళాధర్‌గారు స్వార్థంలేని కళారాధకుడే! వారి కిదేనా మనం చూపే కృతజ్ఞత! మీరే ఆలోచించండి!

ముర: (సర్దుకోవటం అయిపోయింది) ఆ! అయిపోయిందా నీ ఉపన్యాసం!

రంగ: నువ్వూరుకోరా మురళీ! నిజంగా.... ఇది....

ముర: అబద్ధం అని ఎవురన్నారోయ్!

రంగ: అదిగాదురా! కనీసం రేపు నాటకాని కన్నా ఉందామని.

ముర: ఆఁ. ఆ నాటకానికన్నా ముందు ఈ యింటాయన విలన్ పోజులుకు తట్టుకొనే రియాక్షన్ నేర్చుకోవాలని మనం...రారా.. అంతగా అయితే నాటకానికి అందుకో వచ్చులే. ఊఁ కదులూ?

రంగ: సరె నీయిష్టం....వస్తామండీ శాస్త్రి గారు.

శాస్త్రి; మంచిది, పోయిరండి. చెప్పవలసిందేదో చెప్పాను. తర్వాత మీ ఇష్టం.

రంగ: అబ్బే! తప్పక వచ్చేస్తాంలెండి!

ముర: ఇదుగో రంగం! నువ్వు నేరుగా ఈ గొందిన్నే రిక్షాలోపడిపో! అఁ....నేను మన పొట్టి అవతారంగాడి దగ్గరకెళ్ళి చార్జీలకు తైర్ గొట్టొస్తా! జాగ్రత్త!

రంగ: ఏమోనాయనా! మన ఇంటి వీరభద్రుడు ఎక్కడెదురౌతాడో. నేను ఒంటి గాణ్ణి.

ముర: ఛ! అపశకునపక్షీ! ఊఁ నడువ్!

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

శాస్త్రి: (దిగులుగా— వారు పోయినవైపే చూస్తూ ఉండి, వెనక్కువచ్చి కూజాలో నీళ్ళుతాగి పుస్తకం తీసుకుంటాడు)

కనకయ్య: (ప్రవేశిస్తూ) బాబూ! మా చిన్న బాబుగారుండారా?

శాస్త్రి: (తలపైకెత్తి, కనకయ్యనుచూచి, ఆశ్చర్యంగా) ఆ! కళాధర్‌గారు ఇంటిదగ్గర లేరన్నమాట!

కన: (దిగులుగా) అయితే ఇక్కడికి రాలేదా బాబూ!

శాస్త్రి: నువ్వనేది నాకర్థం కావటంలేదు... అంటే....ఆయన అసలు ఇంటి కెప్పుడొచ్చారు? ఎప్పుడు ఇంటిదగ్గర్నుంచి బయలుదేరారు?

కక: వారం కితం వచ్చినారు బాబూ! నిన్నటిదాకా ఇంటికాణ్ణే ఉండారు. అక్కణ్ణించి ఈడకేమన్నా వచ్చారేమో చూసిరమ్మని పెద్ద బాబుగారు నన్నంపారు బాబూ!

శాస్త్రి: అయితే ఎక్కడికెళ్ళుంటారంటావ్!

కన: నా కెట్టా తెలుస్తది బాబూ! నా బాబేమైపోయాడో!... ఎదవది.....పెదబాబుగారు పుటుక్కున కోప్పడ్డారు. ఇప్పుడేమో దిగులు పడుతుంటిరి! అస లెందుకొచ్చిన శ్రమ బాబూ ఇది!

శాస్త్రి: ఆ! పెద్దబాబుగారు కోప్పడ్డాలా!

కన: మరే బాబు! చినబాబేమన్నాగాని డబ్బడిగినారు బాబూ! శానా పెద్ద మొత్తంలే. అసలు నీకీనాటకా లెందుకు. లచ్చనంగా సదువుకోక అని పెద్దబాబుగారు రువ్వంత కోపంగానే అన్నారయ్యా! ఆ మయన.

శాస్త్రి: అసలు ఎంతడిగారు?

కన: యాభై వేలు కావాలంట బాబూ! ఏందో నాటకం కట్టించాలంట....

శాస్త్రి: నాటకం కట్టించే దేమిటి....ఓ! నాటక రంగస్థలమా....ఆఁ తర్వాత, తర్వాత....

కన: అది లేకుంటే దేశంలో శానా కొరతగా ఉందని, నాటకాలు.....,ఏందో.....కలా కారులు....సస్తుండ్రై అని........పెద్ద పెద్ద మాటలు మాట్లాడేరు బాబూ.........నాకేం తెలుత్తయ్!

శాస్త్రి: (ఒళ్ళంతా పులకరిస్తుంది, కృతజ్ఞతతో విండిన చూపుతో హృదయపూర్వంగా కళాధర్ గారికి తెలియకుండానే వందనం చేస్తాడు.)

కన: (శాస్త్రిని చూచి) ఏందో....వస్తా బాబూ.

శాస్త్రి: (శాస్త్రిని చూచి) అ....అ....అందుకు పెద్దబాబుగా రేమన్నారు?

కన: ఆఁ! ఏముంది బాబూ! నువ్వు కడుపున శడబుట్టావు. మన వంశం ఎట్టాటిది నువ్వుచేసే బజారుపన్లేమిటయ్యా, అసలు నాకు కొడుకే పుట్టలేదనుకుంటానని పెద్ద అయ్యగారన్నారయ్యా! అంతే! రెండు రోజులు తిండి తిప్పల్లేకుండా చినబాబు గదిలోనుంచి బయటికి రాలేదు. పిలిస్తే పలకడు, తలుపు తియ్యడు... (కళ్ళనీళ్ళ పర్యంతం అవుతుంది, గద్గద స్వరంతో) మణిసంతా నీరసిచ్చిపోయుండారయ్యా! చిన్నప్పటినుంచి ఈ నేతుల్తో ఎత్తిపెంచాను. ఏమైపోయాడో నా బాబు!

శాస్త్రి: ఛ! దిగులుపడకు కనకయ్యా! వచ్చే స్తారులే....అయితే ఒకపనిచెయ్!

కన: ఏందిబాబూ!

శాస్త్రి: నువ్వు తక్షణం పెద్దబాబుదగ్గర కెళ్ళి వారితోచెప్పు. బంధువుల దగ్గర కేమన్నా వెళ్ళారేమో ఫోనులో మాట్లాడమను. నేనూ ఈ చుట్టుపట్ల ప్రయత్నం చేస్తాను.

కన: పెద్దయ్యగారుగూడా వచ్చుండారుబాబూ. వార్ని ఈడకే తోడుకొస్తా. తమరే ఆయన గారికి అన్ని సంగతులు చెప్పండి.

శాస్త్రి: ఆ! వారుగూడా వచ్చారా! సరే నువ్వెళ్ళి వారిని తీసుకురా.

కన: సరె. వస్తానుబాబూ.

శాస్త్రి: మంచిది. త్వరగావెళ్ళు. (కనకయ్య వెళ్ళును)

(శాస్త్రి గదంతా సర్దుతూ ఉంటాడు)

(మాసిన గడ్డంతో, సంస్కారములేని జుట్టుతో మాసిన లాల్చీ పైజామాతో, శూన్యం లోకి చూస్తూ ప్రవేశిస్తాడు కళాధర్.)

శాస్త్రి: (ఆశ్చర్యంగా) ఆ! కళాధర్ గారా! ఎప్పుడొచ్చారు?

కళా: (నిదానంగా, నీరసంగా) ఇప్పుడే వస్తున్నాను. మురళీ, రంగడూ ఏరీ!

శాస్త్రి: ఇప్పుడేనండీ! ఒక పావుగంట క్రితమే ఊరికెళ్ళతామని వెళ్ళిపోయారు.

కళా: ఆ! ఊరికెళ్ళిపోయారా! ఎందుకని?

శాస్త్రి: ఏమోనండి! ఎంత చెప్పినా వినిపించుకోలేదు. నాటకాని కందుకుంటామన్నారు. హుఁ తిన్నింటి వాసాలు లెఖ్ఖపేట్టే రకం!

కళ: (దీర్ఘంగా నిట్టూర్చి) వాళ్ళనని ఏం ప్రయోజనం....ఈ లోకమే అంత! దీని



కళ్ళకు పొర లడ్డుపడి వెలుగు చూడలేక చీకట్లో దిక్కూ-తెన్నూ కానక చింట లేస్తుంది....అసలు కళాజ్యోతిని చూడలేక పోతుం దీ లోకం పాపం! అమాయకపు లోకం.

శాస్త్రి: ఏమిటండీ! ఈ రోజు మీ రేదో వింతగా మాట్లాడుతున్నారు.

కళా: అవును. వింతే! కాని ఈ వింతలన్నీ సృష్టి మొదలుకొని వాస్తూనే ఉన్నవి. అడుగున పడ్డాయి! లేవనెత్తే శక్తి లేదు. బలం సన్నిగిలింది! అమృతకలశం తొణికింది! మనస్సంతా కల్లోలమైపోయింది. దిక్కు లేని ఎడారిలా మారింది నా బ్రతుకు....

శాస్త్రి: బాధ పడకండి! ఏనాటికైనా మీ ఆశయం తప్పక నెరవేరుతుంది. ఈ కష్టాలు ఎల్లకాలం ఉంటాయా చెప్పండి!

కళా: కల్పించుకొనేవిగావీ కష్టాలు. వాటికై వచ్చినవీ గావు. మానవ హృదయాల్లోని మాలిన్యం వదలి నూతనావేశం ఏనాడు ప్రవేశిస్తుందో ఆనాడే మనకీ, దేశానికీ కమ్ముకున్న చీకటి తెరలు తొలిగిపోయి వెలుగుదారులు కనుపిస్తాయి. అంతవరకూ దేశానికి లేదు శాంతి!

శాస్త్రి: సత్యం చెప్పారు! కాని అందరూ చేతులు కలిపితేనే గదండీ ఏ ఆశయమైనా ఫలించేది?

కళా: అవును. అందరూ కలపాలి చేతులు. కలిపేందుకు దారి! ప్రజల్లోని అజ్ఞానాన్ని నిర్మూలించాలి. అప్పుడే దేశంలో విజ్ఞానం వెల్లివిరుస్తుంది. అందుకే అజ్ఞాన నిర్మూలనానికి అందుబాటులోనే ఉన్నాయి అభ్యుదయ నాటకాలు. దేశం చూడాలి ఆ నాటకాలు! హృదయాలు క్రొత్త రసావేశాలతో నిండాలి. దేశం కళామయంగా వెలుగొందాలి.

(శాస్త్రికి ఏమీ అర్థంగాక చూస్తూఉంటాడు)

కాని ఆ నాటకాలు ఆడాలంటే-ఎక్కడ ఆడాలి? ఇంతకాలంగా మనం ఎన్నో నాటకాలు ఆడాము. ఏ ఒక్కటన్నా విజయవంతంగా ప్రదర్శించామా! లేదు! కారణం? రంగస్థలం కొఱత... లోకంలో ఎందుకింత అవివేకం తాండవం చేస్తుంది....నా తల్లికి ద్రోహం జరుగుతూ ఉంటే ఎలా చూస్తూ ఊరుకునేది....గులాబి రేకుల్లాంటి కళాకారులెందరు నలిగిపోయారో ఈ నీతిలేని లోకపు రాపిడికి. (ఆవేశం హెచ్చుతుంది) ఇక ఓపికపట్టి లాభంలేదు. నా రక్తంతో నా తల్లికి తర్పణం చేస్తాను. (అంటూ ఆయాసంతో తూలిపడబోతాడు. శాస్త్రి పట్టుకొని వాలుకుర్చీలో పడుకోబెటతాడు)

శాస్త్రి: అసలే నీరసంగా ఉన్నారు! ఆవేశ పడకండి. బహుశా నాన్నగారు ఈ పాటికి వస్తూవుంటారు. కొంచెం హుషారుగా ఉండండి.

కళా: (తగ్గుస్థాయిలో) ఆ! నాన్నగా రొస్తున్నారా! నీ కెలా తెలుసు?

శాస్త్రి: మీరు రాబోయేముందుగానే కనకయ్య వచ్చి వెళ్ళాడండి. మిమ్మల్ని నాన్నగారు చూచిరమ్మనారట. వారూ దిగులుతో....

కళా: హుఁ! దిగులు! ఎవరికి దిగులు!! ఎందుకు దిగులు!!! (పెద్దగా నవ్వబోయి నవ్వలేక గుండె చేత్తోపట్టుకొని 'అమ్మా, అమ్మా' అంటూ కుర్చీలో వెనక్కి పడిపోతాడు)

శాస్త్రి: (గాభరాగా) కళాధర్‌గారూ! కళాధర్‌గారూ! (పుస్తకంతో విసురుతుంటాడు)

(కనకయ్య రామారావు ప్రవేశం)

రామారావు: ఏమయ్యాశాస్త్రీ: మీరంతా చేరి....
శాస్త్రి: (రామారావుగారిని చూచి, సైగతో కళాధర్‌ను చూపుతాడు దిగులుతో)
రామా: (ఆత్మతగా కళాధర్ వద్దకొచ్చి చూస్తాడు. మనిషి ఒక్కసారిగా తగ్గి పోతాడు) ఆ!....ఏం జరిగిందయ్యా! ఇక్కడి కెప్పుడొచ్చాడు ?
శాస్త్రి: అంతా తర్వాత మాట్లాడుకుందాం. ముందు త్వరగా డాక్టరుకోసం కబురు చెయ్యండిసార్!
రామా: కనకయ్యా!
కనకయ్య: అయ్!
రామా: అర్జంటుగా వెళ్ళి డాక్టర్ను పిలుచుకురా! ఊం! ఇక్కడున్నట్లు రావాలి.
కన: (వెళ్ళును)
రామా: (కళాధర్ ప్రక్కగా కుర్చీలో కూర్చొని దిగులుగా, భయంగా కళాధర్‌ను చూస్తూ) నాయనా! కళా!....ఇలా చూడు....ఇదుగో....
కళా: (కళ్ళు తెరవడు, నీరసంగా) ఊం!
రామా: నేను....నాన్నను....ఇటుచూడు కళా, నాయానా!
కళా: (నిదానంగా) నాన్న........నాన్న...... నాన్న!
రామా: (ఆశగా) అ.....అవును బాబూ..... నాన్నని....నేను....ఇటు చూడు బాబూ.
శాస్త్రి: అవునండీ...నాన్నగారొచ్చారు. చూడు (రామరావుతో) ఇక పరవాలేదు లెండి!
రామా: ఎందుకొచ్చిన తిప్పలు బాబూ ఇవి! నీకేం తక్కువ! ఏం కొరవచేశానని ఈ ముసలినాన్న మీద అలిగావ్ నాయనా!
కళా: (మెల్లిగా కళ్ళు తెరిచి రామారావును చూస్తాడు.)
రామా: (ఆనందంగా) నాయనా! కళా.... (భుజాలు పట్టుకొని లేవతీయబోతాడు.)
కళా: (పిచ్చివానిలా చూస్తూ) అగు! ఎవరు నువ్వు!
రామా: (ఒక్కసారిగా నిర్విణ్ణుడై) ఏమిట్రా అలాగంటావ్! నాన్నను బాబూ!
కళా: నాన్న!......నాకు నాన్నవా?......ఎవరన్నారు....నాకు నాన్నా లేడు....ఎవ్వరు లేరు......నా కుందల్లా ఒక్క తల్లి,..... అదుగో నా కళామతల్లి, కరుణామయి, చిరునవ్వుతో పిలుస్తూంది......వస్తూన్నా నమ్మా....అమ్మా!......(అంటూ మళ్ళీ కళ్ళు మూసుకుంటాడు నీరసంగా.)
రామా: (కళ్ళ నీళ్ళు తుడుచుకుంటాడు.)
శాస్త్రి: ఏమి అర్థంకాక కళాధర్‌వైపు చూస్తూంటాడు.)
(కనకయ్య డాక్టర్‌తో వస్తాడు)
కన: అయ్యా! డాక్టరుగా రొచ్చారు.
రామా: (వణికిపోయె స్వరంతో) రండి సార్....నా బిడ్డని....
డాక్ట: భయపడకండి రామారావుగారూ! పెద్దవారు మీరే ఇలాగైతే ఎలా?
రామా: ఏంచెయ్యమంటారు? నా కుందల్లా...
డాక్ట: (చిన్నగా నవ్వి) ఇంతమాత్రాన భయపడతారేమండీ! (శతస్కోపుతో పరీక్షించి, చేతి నాడి చూస్తూంటాడు)
కళా: (మెల్లిగా కళ్ళు తెరచి) అమ్మా!..... ఎవరు మీరు! ఏమిటీ యమబాధ!..... అమ్మా!....
డాక్ట: నే నండీ డాక్టర్ను! మీ రలాగే కదలకుండా పడుకోండి! అదే తగ్గిపోతుంది.
కళా: అం తగ్గేదేమిటి? మీ కొచ్చిన వ్యాధేమిటి?

రామా : డాక్టర్‌గారూ ! అలాగంటా దేమిటండీ !

డాక్ట: ఆఁ ! ఏం లేదు. పైత్యంవల్ల కళ్ళు తిరుగుంటాయి.

కళా : ఎవరికి పైత్యం. (ఒక్కసారిగా ఆవేశ పరుడై కూర్చొని) ఏమిటీ వాగుడు ! పైత్యం మీకు. (ఉన్మాదంగా) తుప్పు పట్టింది మీ హృదయాలకు ! నిత్య నూత్నంగా శోభిల్లే నా తల్లికి పైత్యం పట్టిందంటారా ! ఎవరు మీరు. ఓ ! డాక్టర్ గారా ! డాక్టర్ పైత్యం అంటే ఏమిటో తెలుసా అసలు ?

డాక్ట: మాట్లాడకుండా కొంచెం విశ్రాంతి తీసుకోండి.

కళా : (లేచాడు. అంతా చకితులై, భయంగా చూస్తుంటారు) ఎందుకు మాట్లాడగూడదు. నేను చేసిననేరం ? నాకు వాక్స్వాతంత్ర్యం ఉంది. మాట్లాడుతాను. పాడుకుంటాను. ఏడుస్తాను... ఓ... మీబోటి పెద్దలముందు మాట్లాడగూడదు... తప్పుగదూ ! మా బోటి వాళ్ళం మీముందు ఏడిస్తేనే మీకు హాయి ! విని ఆనందిస్తారు ! మానోళ్ళు మూయగలరు మీ ధనాధికారబలంతో ! కాని నిత్యమూ మా హృదయాల్లో ప్రజ్వరిల్లే కళా జ్యోతిని ఆపగలరా ! అది మీచేతనేమౌతుంది. (లాల్చీ చింపుకొని, తన గుండెను తట్టుతూ) నిర్విరామంగా ఎప్పటికప్పుడు క్రొత్త అలలతో పొంగి ఉరకలెత్తే గంభీర సాగరమిది ! చలించదు ! చలించినా ఆపే చెలియలికట్ట ఏది ? అడ్డుపెట్టే దెవరు ?

శాస్త్రి: (అర్థంగాని చూపులతో కళాధర్‌ను చూస్తూ సమీపించి చెయ్యి పట్టుకుంటాడు)

కళా: (విదిలించుకుంటాడు) ఆలా చూస్తారేం ! మీరు మనుషులుగారూ ! మిమ్మల్ని చూస్తుంటే నాకేమిటో భయమేస్తుంది.

రామా ; (కళ్ళవెంట జలజల నీరు కారుతుంది. డాక్టర్ చేతులు పట్టుకొని, దుఃఖపూరిత స్వరంతో) నా వంశాంకురాన్ని నిలపండి డాక్టర్... మీరు కోరిన ధనమిస్తాను... డాక్టర్ !

డాక్ట : (మౌనంగా, దీర్ఘంగా ఆలోచిస్తుంటాడు.)

కన: (కన్నీళ్ళు పెట్టుకుంటాడు)

కళా : (భయంగాచూస్తూ) మీరు రాక్షసులు, మీకు దూరంగా ఉండాలి...మీరంతా కళాద్రోహులు...కళాపోషకులమనే బిరుదులతో కళకాసించిన చీడపురుగులుమీరు. పూలమాలల మోతల్లో... మెర్క్యురీలైట్ల వెలుగుల్లో...అమాయక ప్రజముందు నిలిచి దిక్కులు పిక్కటిల్లేలా కళా హృదయులము, కళా పోషకులమని చాటేవారే మీరు, ఏమి చేశారు ! నాతల్లికి ఉంటానికింత స్థలం లేకుండా చేశారు. నాతల్లి ఇక్కడ నాకు కనుపించదు.

రామా ! (ఒణికిపోతూ) డాక్టర్‌గారూ...ఏమిటండీ ఇది...మతిగాని చలిం (గొల్లున ఏడుస్తాడు)

డాక్ట : చూడండి కళాధర్‌గారూ...మీరు కావాలనేదేమిటిప్పుడు !

కళా : (నవ్వుతూ) కావాలట...ఏమిటో... పిచ్చి !...తెలియదు పాపం...దేశంలోని కళాకారుల కేంకావాలి...కళామ తల్లిని కొలిచేందుకు ఒక మందిరం కావాలంటారు ఆ భక్తులు...ఎందరో మహామహులు పాటుపడ్డారు. దేశానికింత సేవజేశారు...(కన్నీళ్ళతో) ఎన్నో కలలు

గన్నాను. ఆశాసౌధాలు నిర్మించాను. కాని అవన్నీ ఇప్పుడు ఒక్కటొక్కటే రాళ్ళతో సహా పునాదుల కాడికి రాలిపోయాయి. ఆశయాలు నిరాశ్రయ మయ్యాయి...ఇక ఇక్కడేంపని నాకు...(అంటూ వేగంగా టేబుల్ మీదున్న నాట్యమండలి బోర్డు తీస్తాడు. ఏడుపు స్వరంతో) అమ్మా!... అవివేకులు నిన్ను చూడలేకపోతున్నా రమ్మా! అడుగున పడిపోయావా తల్లీ! మానవ హృదయాలు ధూళితో నిండి ఉన్నాయమ్మా. (బోర్డుమీదున్నదుమ్మును చేతితో తుడుస్తాడు) నా కిక్కడ స్థానం లేదు.

(అందరూ ఒక్కసారి "కళాధర్" అంటూ ఎదురు వస్తారు.)

కళా; ఆగండి! ఛీ! నన్ను ముట్టకండి!... అమ్మా! ఈ బాధనుండి విముక్తిలేదా అమ్మా! అమ్మా...నీ బిడ్డను పిలువమ్మా పిలువ్!...ఆ! ఎవరిదీ ఆ తీయని పిలుపు! అవును! నా తల్లిదే!...హాయిగా. చల్లని గాలుల్లో, లోతైన పర్వతలోయల్లో తీయని వెలయేటి నీటితుంపరల్లో, పచ్చని మైదానాల్లో, గంభీర సాగరపు టలల నురుగుల్లో నీతోబాటు కలసి నాట్యం చేస్తా నమ్మా! గొంతెత్తి స్వేచ్ఛాగానం చేస్తాను. ఈ మనుషులకు దూరంగా నీ చల్లని కనుపాపల వెలుగుల్లో శాశ్వతంగా నిలిచి పోతాను... వస్తున్నానమ్మా.. .వస్తున్నా (పరుగెత్తబోయి కాలు తట్టుకొని బోర్లా పడిపోతాడు. నోటిన రక్తం కారుతుంది)

రామా: (పెద్దగా ఏడుస్తూ) నాయనా కళా! (అంటూ కళాధర్‌పై పడిపోతాడు)

డాక్ట: రామారావుగారూ! (అంటూ లేవ తీస్తాడు)

శాస్త్రి: కళాధర్‌గారూ! కళాధర్‌గారూ (అంటూ కళాధర్‌ను కనకయ్య సహాయంతో వాలుకుర్చీలో పడుకోపెడతాడు)

డాక్ట: (కళాధర్ నాడి చూచి దీర్ఘంగా ఆలోచించి) చూడండి (శాస్త్రితో) వీరు ఇక్కడికి వచ్చినప్పు డెలా ఉన్నారు?

శాస్త్రి: చాలా నీరసంగా ఉన్నారండి! మన స్వంతా చెడిపోయినట్లు మాట్లాడారండి!

డాక్ట: O! I see! రామారావుగారూ! ఇది మానసికంగా కలిగిన బాధవల్ల వీ రిలా అయ్యారండి! దేనివల్ల వీ రిలా బాధపడుతున్నారో ముందు తెలుసుకుంటే మనం ఏదైనా చేయడానికి వీలుంటుందండీ!

రామా: (దుఃఖముతో, తనపై కోపంతో) దీని కంతటికీ కారణం నేనేనండీ! నేనే....

డాక్ట: ఆ! మీరా!

(శాస్త్రి, కనకయ్య ఆయోమయంగా చూస్తూంటారు)

రామా: అవును. నేనే నండీ! నన్ను యాభై వేల రూపాయ లిమ్మన్నాడు, లేకుంటే కనీసం ఒక థియేటర్ కట్టించమన్నాడు, నే నందుకు ఒప్పుకోలేదు. లేకుంటే నా భాగం నా కివ్వమన్నాడు. నీకసలు భాగమే లేదు. చిల్లిగవ్వ గూడా ఇవ్వను. లక్షణంగా చదువుకోమన్నాను.....ఇందాకటి నుంచీ కళామందిరం కళామందిరం అని వాడంటూనే ఉన్నాడు. మండిపోయిన నా మతికి అర్థమైచస్తేగా ఊహించటానికి.... ఇది ఇంతౌతుం దనుకోలేదండీ. లేకుంటే వెధవది ఒక్కటి గాదు అలాంటివి పది కట్టించనూ...... ఎలాగైనా నా కళను బ్రతికించండి డాక్టరుగారూ, నాబిడ్డను నాకు దక్కేట్టు చెయ్యండి.

డాక్ట : ఇక భయం లేదు. వారు కోరినట్లుగా చేస్తే వారికి తృప్తికలిగి యథాప్రకారం రావచ్చును. అంతా ఆ దేవుని దయ, ప్రయత్నం చేద్దాం.

రామా : ఎంతడబ్బైనా సరే ఇస్తాను. అలాగే చెయ్యండి.

(కళాధర్‌కి ఆయాసం జాస్తవుతుంది. ఊపిరి వేగంగా పీలుస్తుంటాడు.)

రామ : డాక్టరుగారు ఇలా చూడండి! ఏమిటలా అంటాడు.

డాక్ట : ఏం పర్వాలేదండి! అలుపువల్ల అలా అంటున్నాడే గాని వేరే ఏమీలేదండి!

రామా : ఇప్పుడేం చెయ్యమంటారు ?

డాక్ట : వారు కోరినడబ్బు ఇచ్చి మెల్లిగా మన లోకంలోకి తీసుకరావాలి.

రామ : దాని కింకా ఆలస్యం దేనికండి! కనకయ్యా!

కన : అయ్!

రామ : బయట కారులో బేగ్‌వుంది పట్టుకురా.

(కనకయ్య వెళతాడు)

(ఇంతలో బయటనుంచి మాటలు వినిపిస్తాయి)

ఇంటి ఓనరు : మొత్తానికి భలేసాములే మీరు. కాస్త ఏమారినట్టయితే ఆ రిక్షా సాటు చేసుకొని ఇక చేతికి చిక్కేవాళ్ళా మీరు. ఏం పనులయ్యా....పైగా పెద్దమనుషులం అంటారు.

మురః : మీ రనేదేమిటండీ అయితే....

ఇంటి : అనేదేముంది. ఇవ్వవలసిన రెండు నెల్ల అద్దె చెల్లించి మీదారిన పొండి మారాజుల్లాగా....ఊఁ పదండి లోనకి (అంటూ ఇంటి ఓనరు మురళినీ, రంగణ్ణీ నెట్టుకొస్తాడు. అంతా వారివైపు చూస్తారు. మురళీ, రంగడూ ఆశ్చర్యంగా అందర్నీ చూసి, పక్కచుట్టలు అవతలవేసి అర్థం గాక చూస్తూ కళాధర్ ప్రక్కనే చేరి చూస్తూంటారు. ఇంటాయన హఠాత్తుగా ఆగి ఆశ్చర్యంగా చూస్తాడు)

కన : (బేగ్‌తో వచ్చి) అయ్యా!

రామా : ఆ! ఏది!....(తీసుకొని చెక్కు బుక్కుతీసి చెక్కువ్రాసి డాక్టరు చేతి కిస్తాడు) ఇదుగోనండి డాక్టరుగారు ఏభై వేలకిచెక్కు. మీ ఇష్టం. ఏం చేసినా మీరే!

డాక్ట : (చెక్కు తీసుకొని) ఇదుగో... కళాధర్‌గారూ ...ఇటుచూడండి...డబ్బండీ! డబ్బు!!

కళా : అమ్మా (అని మూలుగు).

డాక్ట : మీరు కోరిన డబ్బు ఇదిగోనండి. మీ ఇష్టమొచ్చినట్లు చేసుకోండి. కళామందిరము కట్టించుకోవచ్చు! ఇటుచూడండి!

కళా : (కళ్లు తెరుస్తాడు, రెప్పలు ఆరుస్తాడు చెక్కువైపు అలాగే చూస్తూ ఏదో మాట్లాడబోతాడు, మాట పెగ్గిలిరాదు. గుటకలేస్తాడు, పెదాలు నాలికతో తడుపుతాడు)

(అందరూ ఆశగా చూస్తారు)

డాక్ట : (ఆశగా చూస్తూ కాగితాన్ని ఇంకా దగ్గిరగా పెట్టుతాడు)

కళా : (మెల్లిగా గొణుక్కుంటాడు) డబ్బు... డబ్బు...యాభై వేలు యాభై వేలు.

డాక్ట : అవునండీ! డబ్బు! మీరు కోరిన మొత్తం! యాభై వేలు తీసుకోండి.

కళా : (కాగితం చేతులోకి తీసుకొని అటుఇటు త్రిప్పిచూసి, ఒక్కసారిగా పెద్దపెట్టున నవ్వుతూ లేచి నిల్చుంటాడు).

(అంతా ఆశ్చర్యపోతారు. లేచి నిలబడతారు. ఒక్కరికీ నోటమాటరాదు, సంభ్రమాశ్చర్యాలతో కన్నార్పకుండా కళాధర్‌ను చూస్తుంటారు).

కళా : (నవ్వుతూ) మీ కిదంతా అయోమయంగా ఉందిగదూ ! అవును మీకేం తెలుసు పాపం ఇది నాటకమని !

అందరూ : ఆ ! నాటకమా !

కళా : మఱి కాకేమనుకున్నారు ఇది సింపుల్ ఒక్క One Act Play మాత్రమే. అంటే ఏకాంకిక.

డాక్ట : ఆ! ఇదంతా వట్టిదేనన్నమాట : ఇలా ఎందుకు చేశారు కళాధర్‌గారూ !

కళా : (చెక్కును చూపుతూ) ఇందుకుసార్ ఇందుకు ? చూశారా నాన్నగారూ ! మీ దగ్గర కింతకుముందు ఎందరో కళాకారులు వచ్చి కానీకూడా పొందకుండా వెళ్లేవారు. కాని ఈనాడు నీ బిడ్డమీదగల మమకారంతో అన్నీ వదిలి నీ ఆస్తినే త్యాగం చేయబూనావు. దీనికంతకీ కారణం ఈ నా ఏకాంకిక అన్నమాట. ఇప్పటికైనా తెలుసుకున్నారా కళ అంటే ఏమిటో, నాటకాలంటే ఏమిటో.

శాస్త్రీ: విడిగా నాటకాల్లోకంటే ఈ నాటకాన్ని బాగా నటించా ననుకుంటాను. కాని తోటి నటులైన మీకు రియాక్షన్ మాత్రమే కదూ ! దీన్నంతా నాటకంగా వ్రాసి మనథియేటర్ ప్రారంభోత్సవంనాడు ప్రదర్శించాలి. ఈ నాటికేగదూ మన భవిష్యత్తుకు దారి చూపింది.

రామా : (ముప్పిరిగొన్నవాత్సల్యముతో, ఆనందంగా, ఆనంద బాష్పాలతో) కళా (అంటూ కౌగలించుకుంటాడు, ఆప్యాయంగా తడువుతాడు)

కళా : (సంతోషంగా) నాన్నా ! క్షమించండి నాన్నా !

రామా : క్షమించడానికేమి చేశావురా నాయనా! నా కన్ను తెరిచావు ! నీతోబాటు కలసి నేను ఈ నా ముసలితనాన్ని నీ తల్లికి సేవజేయనీయ్ ! అంతేచాలు.

డాక్ట : (ఊపిరాడక) Wonderful ! Many many congratulations ! కళాధర్ గారూ ! ఎంత గొప్పగా నటించారండి ! అబ్బ marvelous ! నా అనుభవంలో ఇలాంటికేసొక్కటీలేదు. అంటే మీ ఏకాంకికన్నమాట. దీన్నంతా నాడైరీలో వ్రాయాల్సిన మహత్తరవిషయం. మీవి గొప్ప ఆశయాలు. మీ ఆశయాలు నెరవేరేందుకు నేనూ నా చాతనైనంతవరకూ తోడ్పడతానండీ ! నాకెంతో సంతోషం.

కళా : Thanks sir ! అదే కావాల్సింది.

శాస్త్రి : (ఆవేశంతో గూడిన ఆనందంతో, ఇనుమడించిన గౌరవభావంతో) కళాధర్! కళాధర్ ! (అంటూ కౌగలించుకుంటాడు) ఎప్పుడు వ్రాసుకున్నారండీ ఈ నాటకం.

కళా : ఎప్పుడో ఏముంది శాస్త్రీ ! నాన్నగారు గూడా వస్తున్నారన్నావు చూశావ్ ! అప్పుడే వేశాను ప్లాను.

రంగడు
మురళి : క్షమించు కళాధర్ !

కళా : క్షమించేది నేనుకాదు. అదుగో అమ్మ (బోర్డును తెచ్చి) "కళారాధ నాట్య మండలికీ జై".

అందరూ : జై.

శాస్త్రి : (డాక్టరుకు జై. అనమని సైగచేశాడు.)

డాక్ట : (రామారావుగారికి సైగ చేశాడు.)

అందరూ : (ఆనందంగా) జై.

కన : చినబాబుకూ జై. చినబాబుకూ జై !

అందరూ : జై.

(తెర మెల్లగా)



పుస్తక పరిచయము :

# సుందరయ్యా సూక్తులు

రచయిత :
సోమారెడ్డి సుందరరామరెడ్డి

ప్రచురణ :
ఉషానంద పబ్లికేషన్సు,
శ్రీనివాస అగ్రహారం, నెల్లూరు

'విశ్వదాభిరామ వినుర వేమ' లాగా ఈ చిన్న సంకలనంలోని ప్రతి పద్యం 'సుందరయ్యా సూక్తి సూనృతంబు' తో పూర్తి అవుతుంది. వేమనవలె, చార్లవలె లోకంలో జరుగుతున్న సమకాలిక సంఘటనలను, జీవితాన్ని చిత్రించినారు కవిగారు. ఇంచుమించుగా పద్యాలన్నింటిలోనూ ఏదో ఒక సామెతనో, నుడికారాన్నో ఉపయోగించినారు. ఇందులో సంసారాల గురించి, స్త్రీ పురుషుల భిన్న ప్రకృతులను గురించి, రాజకీయాలను, నీతిని, మంచీ-చెడూలనీ ఆధారంగా తీసుకొని పద్యాలను రాసినారు.

చాలాచోట్ల వేమన ఛాయలే కనిపిస్తాయి. వేమన 'ఇంటిలోని పోరు ఇంతింత కాదయా' అంటే 'భార్య జగడాలమారైన అతని బాధ యింత యంత గాదు' అని; వేమన 'గంగగోవు పాలు గంటెడైన చాలు' అంటే 'బలము నిచ్చు తిండి పట్టెడైనను చాలు'; అని ఇలా అనేకం కనిపిస్తాయి. 'పట్టెడన్న మేని పెట్టక పేదకు, గనిరికొట్టి తరిమి కఠినశిలకు, పప్పు పొంగలిడిన ఫలమేమి వచ్చును.' అని మూఢనమ్మకాలమీద విరుచుకపడతారు. మరొకమారు 'మానవ సేవయే మాధవ సేవ' అనే ఆర్యోక్తి ధ్వనించునట్టుగా "పూజసేయ నేల పుత్తడి బొమ్మకు, నిమిషమేని అర్ధనిమిషమేని, ప్రజల సేవ చేయ పరమార్థమబ్బదా ?" అంటారు. జాతి మతము లేదు సమతను చాటింత్రు, హోటలందు భోగి యోగి రోగి సామ్యవాదులకిది చక్కని బాటరా' అని సామ్యవాదాన్ని ఆహ్వానిస్తూనే వ్యంగ్యంగా 'రోగి' అని శబ్దాన్ని వేసి హోటళ్ళను ద్వేషిస్తున్నారు.

ఈ విధంగా ప్రస్తుతం జరుగుచున్న ఎన్నో సంఘటనలను తీసుకొని పొడిపొడి మాటలలో పామరులకు సులభంగా అర్థమయ్యే రీతిలో రాసినారు. ఇందులోని ప్రతి-పద్యమూ ఒకసారి రెండుసార్లు చదివితే కంఠస్థమయ్యేట్టుగా ఉన్నాయి. పుస్తకము చిన్నదైనప్పటికీ పండిత - పామరుల ఆదరణను పొందగలదని చెప్పొచ్చు.

—గూడూరి సీతారాం

## హోమ్ సినిమా ప్రొజెక్టర్

మీ ఇంటి వద్దనే చేత్తో మోసుకొని వెళ్ళడానికి వీలయిన ఈ పోర్టబుల్ ప్రొజెక్టర్‌తో సినిమాను చూసి ఆనందించండి. టార్చి లేక విద్యుచ్ఛక్తితో దీన్ని పనిచేయించవచ్చు. మామూలు 35 మి. మీ ఫిలిమ్‌ను ఇందులో ఉపయోగించవచ్చు. 4'×4' పూర్తి సైజులో తెరమీద వర్ణచిత్రాలు, సంఘటనలు, నృత్యాలు వాటంతటవే చలిస్తూ ఉంటాయి. 10 అడుగుల ఫిలిమ్, నడిపే విధానం, సచిత్రంగా తెలిపే కరపత్రం ఉచితం స్పెషల్ డీలక్స్ రకం రు. 15-50. వి. పి. చార్జీలు రు. 4-50. అదనపు ఫిలిమ్ గజానికి 0-50 నయాపైసలు. రిఫైన్డ్ స్క్రీన్ రూ. 3.



## (డీలక్స్) ఆటోమేటిక్ యాభైగుండ్ల పిస్టల్
### (లైసెన్సు అక్కరలేదు)

ఆటోమేటిక్ యాభైగుండ్ల రిపీటెడ్ దయల్‌తో అమర్చబడిన ఈ అమెరికన్ పిస్టలు పెద్దధ్వని, మంటలు కల్గించి దోపిడిగాళ్ళనూ, అడవి మృగాలనూ పారద్రోలుతుంది. సినిమా, డ్రామా నటులకు చాలా అవసరం శత్రువుల బారి నుండి రక్షించటంలో గొప్ప సహాయకారి. ఖరీదు రు. 10-50. వి. పి. చార్జీలు రు. 2-50. 25 గుండ్లు ఉచితం. అదనపు గుండ్లు డజన్ రు. 1. మేలైన పిస్టల్ కేసు ఒక్కొక్కటి రు. 3-00. రిపేరుచేయటానికి ఫ్యూయల్ ఆయిల్ రు. 1.




*సాంకేతిక పుస్తకాలు:* మీకు సంపూర్ణ సంతృప్తిని ఇచ్చే హామీ ఇవ్వగలం!

ఎలక్ట్రిక్ అండ్ రేడియో గైడ్ : రు. 15 లతో మీరు స్వయంగా రేడియోను తయారుచేసుకోండి. రేడియో రిపేరీ, వైరింగ్, విద్యుచ్ఛక్తికి సంబంధించిన సమస్తమూ 117 బొమ్మలతో బోధించే ఈ సరికొత్త ప్రచురణ వెల రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

భాషా బోధిని : జాపనీస్, చైనీస్, తమిళం, మలయాళం, బెంగాలీ, జర్మనీ ఇత్యాది దేశ విదేశ భాషలు నేర్పించే ఈ పుస్తకం ఖరీదు రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

*దర్జీపని కట్టింగ్* రు. 4. *సబ్బుల తయారీ* రు. 3. *ఫోటోగ్రఫీకళ* రు. 3. *సుహాసనవస్తువుల తయారీ* రు. 1-50. *ఒక నెలలోనే హిందీ నేర్చుకోండి* రు. 4.

1 నుండి 3 పుస్తకాలవరకు వి.పి. చార్జీలు రు. 1-25] [ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే

**Globe - Traders (S. H. 110) Aligarh (INDIA)**